# కవిగారి ప్రియాంశాలు





కవిగారు

(ఆకునూరు గోపాలకిషన్ రావు)



పోతుకూచి సరస్వతీ పీఠం

విశ్వసాహితి

# కవిగారి ప్రియాంశాలు

కవిత్వీకరణ :
క వి గా రు
(ఆకునూరు గోపాలకిషన్‌రావు)

ప్రతులకు :
'అమ్మకృప'
97 వాసవీకాలనీ,
సికింద్రాబాదు-500015
ఫోన్: 27747882

ప్రచురణ :
పోతుకూచి సరస్వతీ పీఠం
విశ్వసాహితి
6-3-196, న్యూ బోయిగూడ,
సికింద్రాబాదు-500003
ఫోన్ : 7533177

ముద్రణ :
ఎ-1 ప్రింటర్స్, యం.కె.నగర్,
హైద్రాబాదు-7

7'97
వెల రూ॥ 30/-

# సాంబశివార్పణం



అరమర లేక నీవు బ్రదుకంతయు భారతి సేవలో భళా
ఇరులగు సాహితీజనము నీదను రీతిగ ప్రోత్సహించి ఓ
అరశత వర్షముల్ గడువ స్వర్ణపుఉత్సవముల్ ఘనంబుగా
జరుగుచునున్నడెబ్బదవ జన్మ సువత్సరమందు సాహితీ
పరునిగ రాష్ట్రమందు కవి వర్గములన్నియు గౌరవించ నా
తరపున సాహితీ కొలువు దర్పణమన్నటులే సరస్వతీ
పరముగ నీదు సేవల నివాళిగ పీఠమునే అమర్చితిన్
'పరమ పితాశ్రీ' సాంబశివ ప్రార్థనయా కృతి స్వీకరింపుమా !

కవిగారు

# శీర్షికా క్రమము


| వరుస సంఖ్య | పేజీ నెంబరు | వరుస సంఖ్య | పేజి నెంబరు |
|---|---|---|---|
| 1. ప్రార్థనా గీతి | 1 | 24. బీహార్ దోపకం తీహారు దర్శనం | 28 |
| 2. ధ్యేయం | 2 | 25. విజయం మనదే | 29 |
| 3. క్రాంతి | 3 | 26. ధర్మమే గెలుస్తుంది | 30 |
| 4. అమలెరుగని శాసనాలు | 4 | 27. నీకూ భయమేనా? | 31 |
| 5. సదాచార సృష్టి | 6 | 28. అసలైన అందాలు | 32 |
| 6. ఎటుపోతున్నాం- ఏం కానున్నది? | 9 | 29. నీవై మసలుకో | 34 |
| 7. నవ నారీమణులు | 11 | 30. దివ్య కాంతులు | 35 |
| 8. ఆలోచించండి | 12 | 31. క్రొత్త రీతి | ,, |
| 9. విశ్వమానవులు | 13 | 32. బుద్ధి | ,, |
| 10. ఆంధ్రుడు | 14 | 33. మానవాళి సేవ గొప్పపూజ | 36 |
| 11. నవ్వానా-ఏడ్వానా | 15 | 34. జిద్దు | ,, |
| 12. దేవభాష | 16 | 35. పని-బాధ | ,, |
| 13. మోక్షం | 17 | 36. మారని మంచి | 37 |
| 14. ఈశ్వరా | 18 | 37. నీకు నీవే గతి | ,, |
| 15. మెండు గురువులు | 19 | 38. గెలుపు | 38 |
| 16. ప్రత్యక్ష నరకాలు | 20 | 39. అంతర్జాతీయం | ,, |
| 17. గంతలిప్పాల్సిందే | 21 | 40. పగ-ప్రేమ | 39 |
| 18 వేడుకోలు | 22 | 41. మసక మనసు | 40 |
| 19. మేలాపకు | 23 | 42. పదవి పొగరు | ,, |
| 20. పోలిక | 24 | 43. యాదేశుడు | 41 |
| 21. కత్తులు దూస్తున్న కాలుష్యం | 25 | 44. తల్లి ఒడి | ,, |
| 22. మగ్గే బాలలు | 26 | 45. కాపాడండి | 42 |
| 23. దేనికని స్వర్ణోత్సవాలు | 27 | 46. భారత్ | 43 |
| | | 47. తప్పు-నిప్పు | ,, |

| వరుస సంఖ్య | | పేజి నెంబరు |
|---|---|---|
| 48. | బుద్ధిబలం | 44 |
| 49. | అదృష్టం | ,, |
| 50. | తిక్క మనసు | 45 |
| 51. | త్రిశరణాలు | ,, |
| 52. | దేవుని వైపు | 46 |
| 53. | నరక నిర్మాతలు | ,, |
| 54. | తల్లి ఒడిలో తరించటం | 48 |
| 55. | భయోత్పాతం | 49 |
| 56. | దౌష్ట్యాంతం | 50 |
| 57. | అమోఘ్ | 51 |
| 58. | మర్యాదాభూషణం | 52 |
| 59 | వింత నైజం | ,, |
| 60. | సవాల్ | 53 |
| 61. | సన్మతము | 54 |
| 62. | డబ్బు | ,, |
| 63. | జాడ్యాలు | 55 |
| 64. | గాడ్పేలు | ,, |
| 65. | వ్యాపారం | 56 |
| 66. | కారుచౌక | ,, |
| 67. | ఆచరణ | 57 |
| 68. | చిన్నవాటికున్న బలం | ,, |
| 69. | గలనులు, లేదులు, కాదులు | 58 |
| 70. | బ్రతుకో | ,, |
| 71. | జిహ్వా వైరులు | 59 |
| 72. | ఆశ్చర్యం | ,, |
| 73. | ఆదర్శులే ఆర్యులు | 60 |
| 74. | స్వర్గం నరకమైన వేళ | 61 |
| 75. | పని | 62 |
| 76. | తిరిగిరానివి | ,, |
| 77. | ఆగ్రహం | 63 |
| 78. | తీసుకో | ,, |
| 79. | మోసం | ,, |
| 80. | మిడిసిపాటు | 64 |
| 81. | హతవిధి | ,, |
| 82. | దేశఖ్యాతి | 65 |
| 83. | సద్వినియోగం | ,, |
| 84. | ఆడవారి మనస్సు | 66 |
| 85. | కలికాలం | ,, |
| 86. | మనమొకటే | 67 |
| 87. | ఆరాధనా భావం | 68 |
| 88. | అనురాగం | ,, |
| 89. | ప్రేమ వాహనము | 69 |
| 90. | చీకటులు | 70 |
| 91. | ఆవేశం | 71 |
| 92. | మారినావెందుకు? | ,, |
| 93. | కన్నె తలపులు | 72 |
| 94. | ఇతరుల కన్నీరు | 73 |
| 95. | తొందరొద్దు | 74 |
| | ఎంత తేడా | ,, |
| 96. | వద్దంటివా?! | 75 |
| | కంప్యూటర్ | ,, |
| 97. | వెళ్ళేదెటకు | 76 |
| 98. | బంధం | 77 |

| వరుస సంఖ్య | | పేజి నెంబరు |
|---|---|---|
| 99. | మోహావేశం | 78 |
| 100. | గుండెలో తుపాను | 79 |
| 101. | తోడు-జోడు | 80 |
| 102. | నేనే ప్రధానినైతే | 82 |
| 103. | పెద్దవాళ్లు | 83 |
| 104 | శాంతి పతాక | 84 |
| 105. | కలిసి వుంటే కలదు సుఖం | 85 |
| 106. | గీతాచార్యుడు | ,, |
| 107. | నల్గురికి | 86 |
| 108. | పంచశీలుడు | 87 |
| 109. | గుండె గుప్పెడు | ,, |
| 110. | శాంతి దూతా వీడుకోలు | 89 |
| 111. | భారతీ స్తోత్రము | 90 |
| 112. | భాసర భారతి | 91 |
| 113. | ఇదేరా సుదినం | 92 |




# ఆభాసవము

"కవిగారి ప్రియాంశాలు" రూపుదిద్దుకోవడంలో చేదోడు వాదోడుగా నిల్చిన ప్రముఖులు :-

1) కృతి స్వీకరణకానందంగా అంగీకరిచిన "పరమ పితాశ్రీ" డా॥ పోతుకూచి సాంబశివరావు గారికి,

2) పీఠికవ్రాసినఆప్తమిత్రులు ఆర్షకవిభూషణ వడ్డపల్లిసత్యంనాయుడుకు,

3) "సర్వజన ప్రియాంశాలు" పరిచయంతో వెన్ను తట్టిన అన్నయ్య శ్రీ దేవులపల్లి సుదర్శన్‌రావుగారికి

4) "ప్రియ వచనం"పరిచయ ప్రియ వాక్యాలలో నా సాహితీ భవిష్యత్తుపై ఆశాజనకభావం వ్యక్తపరచిన సాహితీ సోదరి శ్రీమతి సి. వేదవతికి,

5) "హితాంశాలు" పరిచయంలో ప్రోత్సాహన్నంతా రంగరించి సాహితీ తిలకం దిద్దిన ప్రియ శ్రీమతి డా॥ ఆకునూరు స్వర్ణలతకు,

6) అన్నలాంటి హితైషి శ్రీ పొణుగుపాటి కృష్ణమూర్తిగారికి,

7) "తొలి చూపు" వ్రాసి పెట్టిన సాహితీ శిఖరోన్ముఖులు డా॥ ఆచార్య తిరుమలకు

8) కవర్ పేజీ తీర్చి దిద్దిన ఆర్.వి.ప్రింటర్స్ వారికి

9) ముచ్చటగా పుస్తకం ముద్రించిఇచ్చిన శ్రీషాబుద్దీన్ ఎ1 ప్రింటర్స్‌కు,

10) కార్య సంరంభంలో కనుల ముందు మెదలకున్నా నా సాహితీ గమనంలో ప్రోత్సాహం కల్పిస్తున్న వారందరికీ,

నా హృదయ పూర్వక వందనాలు

క వి గా రు

29-9-97
97 వాసవీ కాలనీ
సికింద్రాబాద్-15

# నా గోడవ

ఫిబ్రవరి 1995 లో కవిత్వం వ్రాయడం మొదలుపెట్టగానే అందరిలా నేనూ సామాజిక దురాచారాలను దుయ్యబట్ట పూనుకున్నాను. ఏప్రిల్ 1995 నుండే ఈ జాడ్యం నాకు పట్టుకుంది. అయితే ముఖ్యంగా నా దృష్టి వర కట్నం చావులూ అమ్మాయిల కన్నీళ్లూ అన్న అంశాలపై కేంద్రీకృతమైంది. అందరిలాగే సమస్యను జరుగుతున్న వాస్తవాలనూ భూతద్దంలో చూపించి ప్రజలను జడిపించి కవిగా నా పబ్బం గడుపుకోడం నేరమనిపించింది. మరేం చేయడం? ఆలోచనలు ఆకసాని కెగిరాయి. పరిష్కారమేదో చూపకుండా పనైందనిపించుకొని కవిత్వం గిలికేయాలనిపించలేదు.

ఆకసాన్నందుకున్న ఆలోచనలు అంతటిఔన్నత్యమైన పరిష్కారంతో తిరిగి వచ్చాయి! నాకో దారి చూపాయి. అమ్మాయిల కన్నీళ్లు వరకట్నం చావులు రెంటికీ ఒకే పరిష్కారం అదే అత్తలను-కోడళ్ళనూ, తండ్రులనూ-కొడుకులనూ దూరం చేయడం. కట్నమనే దాన్ని, అత్తిల్లనే దాన్ని లేకుండా చేయడం అదేనండీ చాలా సులువైన పరిష్కారం. కొడుకు పెళ్ళి చేసి కోడలిని తెచ్చుకొనే సంప్రదాయంలో చిన్న తిరుగుబాటు బిడ్డ పెళ్ళి చేసి అల్లుణ్ణి తెచ్చుకొవడం. మీకందరికీ ఇదనగానే ఇల్లరికం గుర్తుకొస్తుందని నాకు తెలుసు. ఆ మాట ఎందుకనుకోవాలి. కోడళ్ళెన్నాళ్లు కోడరికంలో పాట్లు పడలేదా? అలాగే కొన్నాళ్ల అల్లుళ్లు అల్లరికం పాట్లు పడితేనన్నా తల్లి దండ్రుల తమ కొడుకుల బాధ గ్రహించైనా మేం కోడళ్ళను బాధ పెట్టినందుకిలా జరిగిందని గ్రహిస్తారేమో? అయినా ఏ ఆడపిల్ల పెళ్ళయినా కాని తల్లితండ్రుల మీద ఆధారపడకుండా ఉంటోంది కనుక. పెళ్ళి, శోభనం, సీమంతం, పురుళ్లు, తరువాత పిల్లల పెరుగుళ్లూ యిలా ఏదీ తప్పడం లేనప్పుడు తల్లితండ్రులను దేవతలుగా చూసుకునే వీళ్ళనే యింట్లో వుంచుకొని తల్లితండ్రులంటే భారమను కొనే కొడుకులను ఎందుకు పంపించవద్దు. ఇన్ని నాళ్ళమ్మాయిలు పెళ్ళితో యిల్లు వదిలి వచ్చారు. ఇప్పుడు అబ్బాయిలు పోతారు. అమ్మాయిలు అబ్బాయిలు అంతా ఒకటనుకో వలసిన రోజులు కదా? ఈ చిన్ని సంస్కరణ నెందుకు వెంటనే అమలు చేయవద్దు? ఇదండీ నా ప్రియాతి ప్రియ అంశం. ఇలాగే ఇంకెన్నో అంశాలీ పుస్తకంలో, అన్నీ నా బుద్ధికి

బిడ్డలే కనుక అన్నీ నాకు ప్రియాంశాలయినవి. ఇదీ టూకీగా కవిగారి ప్రియాంశాల కధ. ఈ ప్రియాతి ప్రియాంశాన్ని త్వరలో ఆంధ్రదేశమంతా టముకు వేసి స్వామ్యమార్పిడి సదాచార సృష్టి చేయాలన్నదే నా సంస్కారణాభిలాష! అందరూ సంస్కర్తలూ ఎదుర్కొన్న అన్ని దుర్గతులకూ సిద్ధమయే ఈ అంశం ముందు పెట్టి పుస్తకానికి పేరు పెట్టి ఆంటీ ఆడినిలిస్టెస్టు చేస్తున్నాను. ఇదే రాకెట్‌గా ఈ అంశం అవకాశం అంచులు మరో సారిచూసి వస్తుందని, అమ్మాయిల కన్నీరు నంతం చేస్తుందని ఆకాంక్ష.

ఇందులో కొన్ని నా పఠనా కార్యక్రమంలో భాగంగా పట్టుకొన్న ఇతర భాషా ప్రియాంశాల అనువాదాలు కూడా వున్నవి. అవీ నాకత్యంత ప్రియాంశాలే కావున వాటికీ ఇందులో తావిచ్చాను.

వేదాలు ఉపనిషత్తులు నా చౌపదల రూపంలో స్వేచ్ఛానువాదం చేయాలనే నా తృష్ణకు సూచికలే ఇందులో పొందుపరచబడిన ప్రార్థనాగీతి, క్రాంతి గీతులు. ఎంతవరకీ ఆకాంక్ష తీరుతుందో కాలమే చెప్పాలి.

ఇకపోతే ఈ శీర్షికా క్రమము సాంప్రదాయిక సంచయ సంయమనాలకు అతీతంగా ఉన్నా పాఠకులకు ఒకే రకం వస్తువు పై కవితలు విసుగు కలిగించ కుండా భిన్నంగా వుండేందుకు చేసినదీ ప్రయత్నం. నా పరమ పిత్రాశ్రీ కళాప్రపూర్ణ డా॥ పోతుకూచి సాంబశివరావుగారు అడుగగానే కృతి స్వీకరణకంగీకరించడమేగాక నా ప్రియాంశాలు తనకూ ప్రియాంశాలని పేర్కొన్నారు. ఎంతో ముదము వెల్లడించారు.

ఇక పాఠకులకూ ఇవి ప్రియాంశాలైతే నా జన్మ ధన్యమౌతుంది. లేదా కాలగర్భంలో కలిసిన ఎన్నో పోత్తాలకిదీ వన్నె తెస్తుంది.

మీ

**కవిగారు**

# నా ఆనంద సోపానము

కవిగారు "ప్రియాంశాలు" గ్రంథం నాకంకితమిస్తానన్నారు. ఆయన ప్రియాంశాలు నాకూ ప్రి యాం శా లే. అందుకే అంకితం ఆనందంగా స్వీకరిస్తున్నాను.

కవిగారి కలం ఒక ప్రవాహం. ఆలోచనలు రాగానే అది ఒక నదిలా ఆవిర్భవించి కొండ కోనలు దాటుకుంటూ, ఉత్తుంగ తరంగాల నదీమతల్లి లాగ పరుగిడుతూ చివరకు కావ్య సరస్వతి పాదాలకు ప్రణమిల్లుతుంది. ఆయన భావనలో ఒక వేగం, ఒక మెరుపు, ఒక ప్రశాంత ప్రకృతి దర హాసం ద్యోతకమౌతాయి.

ఏది రాసినా స్పష్టంగా, నిర్భయంగా చెప్పి కవి నిరంకుశుడని ద్రుఢ పరిచారు కవిగారు. అనేక అంశాలు ఈ గ్రంథంలో ఆయన పొందుపరిచారు. ఆయన ధ్యేయం నిర్వచిస్తూ, శాసనాలు, సందేశాలు, ఆలోచనలు, అలజడులూ కూడా ఆయన కలం నుండి జాలువారాయి — యిందులో నినాదాలూ ఉన్నాయి. ఉత్తమ నాదాలూ ఉన్నాయి.

"ప్రియాంశాలు" నామకరణమే ఓ క్రొత్తదనం. రచన నామకరణం లో రచయిత గమ్యం కనిపించాలి. కవిగారి ప్రియాంశాల్లో ప్రతి అంశంలో తమ వ్యక్తిత్వం చాటుకున్నారు కవిగారు.

కాళోజీలా 'నా గొడవ' ఉటంకించారు. ఇందులో కాళోజీ కవితా రీతులు కూడా పుణికి పుచ్చుకున్నారు కవిగారు.

మైత్రివల్లగాని, కవితా వైచిత్రి వల్లగాని అంకితం రాణిస్తుంది. ఇందు లో మైత్రి, కవితా వైచిత్రి రెండూ ఉండడమే ఈ ప్రియాంశాలు నాకు చాలా ప్రియమైనాయి.

ఈ అంకితం నాకో ఆనంద సోపానం నా జీవితంలో.

23-9-97
6-3-195, న్యూబోయిగూడ,
సికింద్రాబాదు-3.

కళాప్రపూర్ణ
డా॥ పోతుకూచి సాంబశివరావు

# పీఠిక

పదినెలలలో నాల్గవ గ్రంధం "కవిగారి ప్రియాంశాలు" వెలువరిస్తూ తన పెద్ద మేనమామ 47 సంవత్సరాల క్రింద తనను కవిగారూ అని పిలిచిన పిలుపును సార్థకం చేసుకున్నారు కవిగారు.

మొదటి గ్రంధం "కవిగారి స్వగతాలు" లో తన ఆత్మీయులైన బంధు మిత్రులను కవిత్వంలో బంధించి చిరస్మరణీయులు చేసి ఓ క్రొత్త ఒరవడి సృష్టించారు.

భారతీయ సంస్కార పర్వాలను జాతీయ రాష్ట్రీయ ఉత్సవాలన్నిటినీ కవిత్వీకరించిన కవిగారి "సందర్భ స్వరాలు" కూడా ఓ నూత్న ప్రయత్నమే అని చెప్పాలి.

తన మూడవ గ్రంధం యేకంగా సాక్షాత్సరస్వతీ స్వరూపిణియైన స్వర్ణలతా సతీమణి సూచన మేరకు వందకంద పద్యాల శతకం ఒకే రోజులో వ్రాసి ఆమె పేరును మకుటంలో యిమిడ్చి ఆమెకే అంకితం చేసి "స్వర్ణ గోపాల శతకం"గా వెలువరించి స్త్రీజాతి ఎడల తనకున్న గౌరవభావం చాటుకొన్నారు. ఇదీ ఓ విసూత్న యత్నమే.

ఇలా యింతవరకెవరూ సాహసించని విధంగా సాహితీ ప్రక్రియలు చేస్తూ పుంఖాను పుంఖాలుగా గ్రంధాలను వెలువరిస్తూ మరో రెండు మూడు నెలలో ఇంకో ఈ "ప్రియాంశాలు" కాక ఇంకో రెండు గ్రంధాలూ వెలువరించి సంవత్సరకాలలో అరు గ్రంధాలు ఆవిష్కరించిన స్థాయికి ఓ ఇంజనీరు ఎదిగాడంటే అదో రికార్డు కాదా? ఇంకా 16 సిద్ధంగా ఉన్నాయంటాడు. భగవద్గీత, వేదోపనిషత్తులూ అన్నీ తనదైన బాణీ చౌపదలలోనికి అనువదించే ప్రయత్నంలో వున్నానంటాడు ఆయన నిమ్మకు నీరెత్తినట్లున్నా వినేవారికే ఆశ్చర్యం కలిగించే పరిస్థితి.

ఇక తన రచనలకు పేరు పెట్టడంలో సిద్ధహస్తుడు. ఈ "ప్రియాంశాలు" లోని అన్ని అంశాలు ఆయనకే కాక నాకూ ప్రియంగానే తోచినవి. చదివిన ప్రతి పాఠకునికీ హృదయానికి హత్తుకొనే ప్రియాంశాలెన్నో

ఉన్నవి. పీఠిక వ్రాయడానికి పూనుకొంటే మొత్తం నూటికి నూరుపాళ్ళు పరిచయం చేయాలన్న స్థాయి వుందీ ఈ కవితల్లో. గ్రంధమంత పీఠిక వ్రాయలేం కదా అందుకని ప్రియాతిప్రియంగా అతి ముచ్చటగా అనిపించిన అంశాలను ఉటంకించి ఆపేస్తాను.

కవిత్వం అట్టడుగు బడుగువానికి అందుబాటులో లేదని నిందింపబడుతున్న తరుణంలో ఆ మాట నిజం కాదన్నట్లు సరససుందర కవితా మకరందాన్నందిస్తున్నారు కవిగారీ పొత్తంలో.

పావన గోదావరీతీర బాసర మహాక్షేత్ర జ్ఞాన సరస్వతీ మాత సందర్శనానంతర సాక్షాత్కార వరప్రసాదంగా "పోతుకూచి సరస్వతీ పీఠం" వ్యవస్థాపకులై రాష్ట్ర రాజధానిలో సరస్వతీమాత నిలయంకూడా నెలకొల్పాలనుకున్నంతటి సరస్వతీ భక్తులు కవిగారు.

వేదాలు, ఉపనిషత్తు తనదైన ఈ కవిగారి సరస బాణీలో వస్తే అవి ప్రసిద్ధ శతకాలలా ప్రజామోదం పొందుతాయనడానికి ఈ పొత్తంలోని మొదటి రెండు శీర్షికలు తార్కాణం.

నాకు ద్యోతకమైన కవిగారి ప్రత్యేకత ఆయన సమస్యను చూపడమే కాక అందులో సందేశం పరిష్కారం తప్పక జొప్పించడం.

కూతురు పెళ్ళిచేసి
అల్లుని నాహ్వానించండి
ఆడపిల్ల కష్టాలను
అర్థంటుగ ఆపుకొండి!

మన అమ్మాయిల కంటనీరు లేకుంటుటకు కొడుకు పెళ్ళిచేసి కోడలును తెచ్చుకొనే బదులు కూతురు పెళ్ళిచేసి అల్లుణ్ణింటికాహ్వానించమంటాడు. ఎంత చక్కటి సంస్కరణా పరిష్కారం. ఇలాచేస్తే కొడుకులూ కోడళ్ళతో

కొరకొరలు పడే మాతాపితరులూ ఉండరు. ఇలా పరిష్కారయుక్తంగా సంస్కరణ ధ్యేయంగా ద్రాక్షాపాకంకన్నా మధురంగా చవులూరించు, పాట లాగా గలగలా సాగే కవితలు కవిగారివి.

సంఘంలోని కుళ్ళును దుయ్యబడుతూ అక్కడికక్కడే దాన్ని క్షాళన చేయాలనే తపన "ఆదర్శవంతమైన జాతినొకటి నిర్మిద్దాం, దేశమాత గౌర వాన్ని దిశలనెల్ల చాటుదాం!" లాంటి దేశభక్తి కవితలు కోకొల్లలిందులో.

పురుషాధిక్య ప్రపంచమని లోలోపల మధనపడుతున్న స్త్రీవాద మహిళామణులు కవిగారి స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకున్న స్త్రీ జాతిని గౌరవించే తీరుకు అభినందించే కవితలు "నవనారీమణులు", "ఆలోచించండి" "సదాచార సృష్టి" లాంటివి ఎన్నో ఉన్నాయి ఈ సంకలనంలో.

ఆదర్శంగా బ్రతకడంలోని అవస్థలు (నవ్వనా- ఏడ్వనాలో). దేశ భాష సంస్కృతాన్ని విస్మరించి దేశం అధోగతిపాలైన వైనం, సమయజ్ఞాన జాతీయతా భావాలు కొరవడడం (దేశభాషలో మన రక్షకుల, వైద్యుల, న్యాయస్థానాల స్థితిగతులు (ప్రత్యక్ష నరకాలులో-గంతలిప్పాల్సిందే లలో) ఇతరులకు నిరంతరంగా మేలుచేయాలనే సందేశం (మేలాపకులో), సూర్యు నికీ, మనిషికీ ఉన్న పోలికలు (పోలికలో), చేయిదాటిపోతున్న కాలుష్యాల గూర్చి (కాలుష్యంలో), క్రమ్ముతున్న బాల కార్మికుల సమస్యా పరిష్కార సూచన పదో తరగతి వరకు నిర్బంధవిద్య ఆయన కవిత వ్రాసిన నెలలో ప్రభుత్వం ఎనిమిదవ తరగతి వరకని నిర్ణయించడం వైనం ఆయనలోని సం స్కరణకు విశ్వరూపంగా నిలుస్తాయి (మగ్గే బాలలులో). వారి పోటీ చక్క దనాల చలాకీ మనుమలు (కొడుకూ- కూతుళ్ళ పిల్లలు) అమోఘ్, శార్యలను అవ్యాజ ప్రేమతో కవితా రూపంలో కమనీయంగా ఉజ్వల భవిష్యత్తునిద్దరికీ ఆశిస్తూ అక్షరాశీస్సులివ్వడం (అమోఘ్, ఇదేరా సుదినాలలో).

ఇలా చెబుతూ పోతే ప్రతి ఖండిక ఒక ఉదాత్తమైనదిగా స్ఫూర్తి, సం

దేశాత్మకత పరిష్కారమార్గాలతో చక్కదనంగా విరాజిల్లుతున్నది. గ్రంథ విస్తరణ భీతిలేకుంటే ప్రతిదీ ప్రత్యేకంగా వివరించాలనేంత ఉత్సుకత కలిగించినా, కవిగారు పాఠక దేవుళ్ళందరూ చదివి ఆలోచించాలన్న ఆయన ధ్యేయానికి న్యాయం కూర్చాలని అతిసూక్ష్మంగా పరిచయ వాక్యాలు ముగిస్తూ సోదరి శ్రీమతి సి. వేదవతి తన "ప్రియవచనాలు"లో రేఖామాత్రంగా సూచించిన ఆశతో ఏకీభవిస్తూ ఇన్ని ప్రియాంశాలు మేధలో ఇమిడ్చుకొని అందులోని అప్రియాంశాలకు మధనపడుతూ వాటికి సంస్కరణాభావంతో పరిష్కారాలు చూపుతూ ఇతరుల బాధలకింతగా ప్రతిస్పందించే కవిగారు ఆయన ఈ "ప్రియాంశాలూ" సర్వజన ప్రియాలౌతాయనడంలో ఎట్టి సందేహం లేదు.

కవిగారు తప్పక ఆంధ్రపాఠక హృదయాలలో చోటుచేసుకుని చిరకాలం వారి అభిమానం పొందుతారనడంలో అతిశయోక్తి లేదు.

సర్వే సర్వత్రా కొనియాడబడే విశ్వసాహితి స్రష్ట, పోతుకూచి సరస్వతీ పీఠ ద్రష్ట కళాప్రపూర్ణ డా॥ పోతుకూచి సాంబశివరావుగారికి ఈ ప్రియాంశాలంకితమీయడం ముదావహం.

కవిగారికి అభినందనలు తెలుపుతూ—

26-9-97

మూదన్నపేట,

హైద్రాబాదు.

ఆర్షకవిభూషణ

**వడ్డపల్లి సత్యంనాయుడు**



# సర్వజన ప్రియాంశాలు

కవిగారి ప్రియాంశాలు చదివాను. కవిగారి ప్రియాంశాలు సర్వజన ప్రియాంశాలు. కటుక రోహిణి కన్న కడు చేదు నిజాల్ని తేనె తీపితో చేర్చి తీర్చిదిద్ది సమర్పించగల నేర్పు కవిగారికున్నది.

ఋగ్వేద స్వేచ్ఛానువాదంగాఉన్న ప్రార్ధనా గీతి, తైత్తరీయోపనిషత్ శ్లోకం స్వేచ్ఛానువాదం క్రాంతి గీతి వైదిక వాఙ్మయము నందితనకి గల ఆసక్తికి నిదర్శనాలు.

ఆంధ్రులు ఆరంభశూరులన్న అపప్రథను వరంగా విజయవంతంగా నిరూపించగలిగాడు.

అసలైన అందాలు అందమై శీర్షిక. క్రొత్తరీతి ఆచరణీయం!

గలనులు, లేదులు, కాదులు చక్కని శబ్దవైచిత్రి.

"ఆడవారి మనస్సు" చేదు నిజం! అతి మధురమైన చేదు నిజం!

:0-8-97 హన్మకొండ

దేవులపల్లి సుదర్శన్

# ప్రియ వచనం

నల్లురకూ హృది పంచుట
నా కవితల నడత విధానం!

ఇది-కవిగారి అంతరంగ రహస్యం. ఆ మాటకొస్తే హృదిని పంచడం కన్నా, ఏ కవితకైనా పరమాశయం మరేముంటుంది కనుక!

అవును! కవిత్వానిది ప్రధానంగా హృదయ భాష! హృదయ శైలి దాని ముఖ్య లక్షణం!

గుండె కరిగినప్పుడే పుడుతుంది పదమైనా, పద్యమైనా!

అసలు ఏది కవిత! ఎందుకు కవిత! అన్న ప్రశ్న వేసుకుంటే సమాధానం తేల్చి చెప్పటం కష్టం!

వెన్నెల ఎందుకు కాస్తుంది? కోయిల ఎందుకు పాడుతుంది? మేఘం ఎందుకు వర్షిస్తుంది? అంటే ఏమి చెప్పగలం?

కవిత ఎందుకోసం? తనను తాను ఉద్ధరించుకోవటం కోసమా? అంటే రసానందంతోకూడిన ఆత్మానందం పొందటం కోసమా? లేక, కేవలం లోక హితార్థం కోసమా?

ఈ ప్రశ్న వేసుకొన్నప్పుడూ అనేక వాదనలు వినవస్తాయి. కవిత్వ తత్త్వాన్ని గురించికూడా ఇటువంటివే మరెన్నో వివేచనలు.

ధ్వని పూర్వకమైన అభివ్యక్తితో కూడిన రసాత్మక వాక్యం కావ్యం అవుతుందన్నమాట. మన పూర్వకవిత్వ తత్త్వవేత్తలు తేల్చి చెప్పినమాట!

అయితే- ఇప్పుడీనాడు ఎన్నెన్నో ఇజాల మధ్యవాదాల మధ్య ఇరుక్కుపోయి ఉక్కిరి బిక్కిరి అవుతున్న కవితా కళ- ఆదొక బ్రహ్మ పదార్థమేమోననిన్నీ అనిపిస్తున్న మాట నిజం!

బ్రహ్మ పదార్థానికైనా బ్రతుకుతో సంబంధం ఉండి తీరవలసిందేమరి!

బ్రతుకంటే- అది మళ్ళీ బ్రహ్మాండమంత అనుభవాల పుట్టకూడాను!

ఒక్కొక్క అనుభవం- కవి అంతరంగంలో అనుభూతిగా మారి, ఊపిరిని కదలిస్తే ఆ భావానికి రూపకల్పన జరిగినప్పుడు పుట్టుకు వస్తుంది కవిత!

అందుకే- కవిత్వం ఒక ఆల్కెమీ- అంటాడు తిలక్.

కవిత్వం- మానవానుభూతిని అవిష్కరించేది అనుకొన్నప్పుడు అది వ్యక్తిపరంగానూ సాగవచ్చు. సామాజిక సంబంధిగానూ ఉండవచ్చు.

ప్రతిమనిషి జీవితమూ రెండు సమాంతర పార్శ్వాల్లో సాగుతుంటుంది. ఒకటి అచ్చంగా తనదే అయిన వ్యక్తి జీవితమూ- రెండవది- తాను భాగమై పోయిన సమాజ జీవితమూ!

ఇందులో ఏ ఒక్క అనుభవమో గొప్పదని కానీ, రెండవది తక్కువ దని కానీ అనటం న్యాయం కాదు. ఏ ఒక్క అనుభవానికో మాత్రమే స్పందించి రాయాలనటం కూడా సమంజసం కాదు.

వ్యక్తి జగత్తూ గొప్పదే! జన జీవన జగత్తూ అంతకన్నా గొప్పదే- వ్యక్తి లేని సమాజమూ, సమాజం లేని వ్యక్తీ ఉండటం ఎట్లా సాధ్యం కాదో! మనిషికి తనను గురించిన అనుభవాలతో పాటు- పరుల గురించిన ఆలోచ నలూ లేకుండా ఉండటం కుదిరేపని కాదు!

అందుకే- కవి స్పందించక తప్పదు- ఏ విధమైన అనుభూతికైనా!

ఇప్పుడీ ఉపోద్ఘాతమంతా ఎందుకంటే- ఈ 'ప్రియాంశాలు' అంది స్తున్న కవిగారు- మొదటిగా కలంపట్టి వ్రాసుకున్న 'స్వగతాలు' అన్నీ వ్యక్తిగత అనుబంధ సంగతాలే అని చెప్పడానికే!

'కవిగారు' అనబడే ఆకునూరు గోపాలకిషన్‌రావుగారికి విస్తారమైన బంధుసంపద ఉంది. వారందరితో ఆయనకు ఆత్మీయమైన సంబంధాలు ఉన్నాయి. వారందరిమీదా అభిమాన వర్షం కురిపిస్తూ ఆయన కవితలల్లు కొన్నారు.

ఈ రకమైన రచనలవల్ల చదువరులకు పెద్దగా ఒరిగేది ఉండక పోవచ్చు. కాని, ఒక్క విషయం మనం అంగీకరించక తప్పదు. ఇప్పుడూ మనం బ్రతుకుతున్న యాంత్రిక నాగరిక సమాజంలో కరిగిపోతున్న మానవ సంబంధాల మూల్యాలేమిటో ఒక్కసారి గుర్తుచేసుకొని, వాటిని పున రుద్ధరించుకొనే ఆలోచన కలిగించడానికి పనికి వస్తాయి ఇట్టి రచనలు.

అయితే- అంతటితో ఆగిపోకూడదు కవికలం! వ్యక్తి స్థాయి నుండి విడివడి. కవి ఆలోచనా లోచనం విస్తృతమైన సమకాలీన జగత్తులోని వివా దాంశాల మీదా ప్రసరించాలి.

కవిగారి తర్వాతి రచనలలో ఈ రకమైన విశాల దృక్పథం ఏర్పడి ఉండటం- నాకు సంతోషం కలిగించిన విషయం. అందుకే- వారు అందించిన "ప్రియాంశాలు" లోని కవితలను ఆసక్తితో చదివాను.

ఇందులో సామాజికపరమైన అప్రియాంశాలను గురించి ఆవేదనతో చెప్పడం ఉంది. కొన్ని సమస్యలకు తనదైన ఆలోచనతో పరిష్కారం సూచించడమూ ఉంది. అనువాద కవితలూ, స్వేచ్ఛాకరణ కవితలు, ప్రేమ కవితలూ ఉన్నాయి.

అన్నీ కలిపి ఈ ప్రియాంశాలన్నీ ఒకే దారానికి గుచ్చిన కదంబ తోరణంలా అనిపిస్తాయి.

కవిగారి కవితలకు ఒక తూగు ఉంది. లయబద్ధమైన నడక ఉంది. దానితోపాటూ భావవేగమూ ఉంది. వచ్చిన భావానికల్లా అక్షరరూపమిచ్చే ఆవేగమూ ఉంది.

నడుస్తున్న మనదేశ చరిత్ర సాక్షిగా- సమస్యలపట్ల తీవ్రమైన ఆందోళనతో- కవిగారు వ్రాసిన కొన్ని ఖండికలు మనలను కలవర పరుస్తాయి. ఆలోచింప చేస్తాయి.

చట్టాలు మనదేశంలో
కలవారికి చుట్టాలు
న్యాయాలు మనదేశంలో
నత్తనడక నమూనాలు

అనడంలో- వర్తమాన రాజకీయ స్థితిరూపం స్ఫురిస్తుంది.

వరకట్నం ఇవ్వడమూ, తీసుకోవడమూ చట్ట విరుద్ధమని అందరికీ తెలుసు. అయినా ఆ చర్య ఎక్కడా ఆగకపోగా- ఇంకా తీవ్రమవటం మనకు తెలుసు. ఏదో ఒక కారణంగా అత్తలు కోడళ్ళను ఆరడి పెట్టటమూ నేటిదాకా సాగుతున్న చరిత్రే!

అత్తింటి ఆరళ్ళ నుంచీ కోడళ్ళగా తప్పించటానికి. కవిగారు సూచించే పరిష్కార మార్గం వినూత్నమైనది!

అసలు పెళ్ళయిన ఆడపిల్ల అత్తింటికి వెళితేనే కదా ఆమెకు ఈ బాధలన్నీ! కొడల్ని రాచిరంపాన పెట్టే అవకాశం అత్తలకు లేకుండానే చేస్తే!

అంటే ఏ ఆడపిల్లా పెళ్ళయిన తర్వాత అత్తింటికి వెళ్ళనే కూడదు!

కూతుర్నీ అల్లుణ్ణీ తమ ఇంటనే అట్టిపెట్టుకునే వ్యవస్థ రావాలి. అల్లుళ్ళే అత్తింటికి తరలి వచ్చే ఏర్పాటు చేసుకుంటే- ఆడపిల్లలకు అగచాట్లు తప్పుతాయి!

ఆలోచించండి! ఇది సాధ్యమయేనా! ఇట్లాంటి వ్యవస్థ ఏదో ఏర్పడి మళ్ళీ మాతృస్వామ్య దశ వస్తే బాగానే ఉండేట్లుంది! కవిగారికి ఇది ప్రియాతి ప్రియాంశం!

రకరకాల కాలుష్యాలతో నిర్వీర్యమైపోతున్న సమాజంలో- ఉన్నవి చాలక, అస్మదీయ, తస్మదీయ, స్వాముల కాలుష్యాలూ చేరిపోతున్నాయంటారు కవిగారు. ఆధునిక జీవితంలోని అవాంఛనీయ పరిణామాలకు ఇది చక్కని వ్యాఖ్య అవుతుంది.

దేశంలో విచ్చల విడిగా పెచ్చరిల్లిపోతున్న అన్యాయాలు, అక్రమాలు దగా, మోసం, అవినీతి, దౌర్జన్యం వంటి అమానుష చర్యలను గర్హించినా.

అనుమానం, అసూయ, అపోహ, ఈర్ష్య, భయం, క్రోధం వంటి లక్షణాలతో ఇతరుల బ్రతుకుల్లో నరకం సృష్టించే 'నరక నిర్మాతల్ని' గురించి ఆగ్రహం వెల్లడించినా.

కవియొక్క సామాజిక దర్శనంలోని నిజాయితీ ఎంతటిదో అర్థమవుతుంది.

ఈ కవికి స్త్రీలపట్ల గౌరవం ఉంది. వారు ఎదుర్కొంటున్న సమస్యల పట్ల సానుభూతి ఉంది. అర్ధాంగిని గౌరవించుకోవడం తెలిసిన కవిగా- కవి గారి వ్యక్తిత్వంపట్ల నాకూ ఎంతో గౌరవం ఏర్పడింది.

అన్నిటినీ మించి- ఈ కవికి సాటివారిపైన ఆర్తి ఉంది. కరుణ ఉంది.

కరుణ లేక ప్రేమ లేక
మానవాళి సేవలేక
బ్రతికే బ్రతుకు కన్న
చావది నిజంగా మిన్న!

నిజంగా కరుణాంతరంగుడయితే తప్ప- కవి ఇటువంటి వాక్యాలు పలకడం సాధ్యం కాదు!

నీ బాధలేగా నీకెప్పుడు
ఇతరుల కన్నీరు నీవెరుగవు
ఇతరుల కష్టాలు నీవడుగవు

ఈ పదాలు చదివినపుడు నాకనిపించింది. మన అనాది సంస్కృతికి మూల సూత్రమేదో దానిని అందుకొన్న కవి కనుకనే- ఆ భావాన్ని ఇంత లేట తెలుగు పదాలలో తెలియచెప్పి ఉంటాడని!

సర్వేజనాస్సుఖినోభవంతు-
అన్నది మన ఋషులు పలికిన సూక్తం!

నిజంగా కవిత్వం కన్నాకూడా బ్రతుకు గొప్పది! ఆ బ్రతుకును కార ణ్యస్పర్శ అనేది. ఆర్ద్రం చేస్తూనే ఉండాలి!

సర్వే భవంతు సుఖినః
సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు
మాకశ్చిత్ దుఃఖ భాగ్భవేత్-

సర్వప్రాణులూ సుఖంగా ఉండాలి! లోకంలో ఎవ్వరూ దుఃఖ పీడితులు కాకూడదు. అందరూ అన్నివేళలా సుఖులై ఉండాలి!

ఎంతటి మాననీయమైన, మహితాత్మకమైన వాక్యం ఇది!

ఇంతటి భావాన్ని ఎంత సున్నితంగానయినా సరే- వాక్యంలో పొంద గలిగితే అంతకన్నా లోకహితమైన రచన ఏముంటుంది?

ఇతరుల బాధల్ని గురించీ, ఇతరుల కన్నీటిని గురించీ ఆలోచించ గలిగిన ఈ కవిగారి గురించి నాకు ఎన్నో ఆశలు ఉన్నాయి. కరుణ కలిగిన కవి క్రాంతదర్శి కాక మానడు!

తమ 'ప్రియాంశాలను' కవిగారు నాకు ప్రియమిత్రులు కళాప్రపూర్ణ పోతుకూచి సాంబశివరావుగారికి అంకితం ఇవ్వడం నాకు మరీ ఆనందం కలిగించిన విషయం!

కృతికర్తకూ, కృతిపతికీ నా హార్దిక అభినందనలు అందిస్తున్నాను.

సి. వేదవతి

6-9-1997
12-2-826/ఎ/45, ఎల్ఐసి కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్.

"కవి కౌస్తుభ"
**డా॥ ఆచార్య తిరుమల**
11-11-152/1/2, సౌభాగ్యపురం,
హైదరాబాదు-35

# తొలిచూపు !

ఆధునిక తెలుగు కవితా రంగంలోకి అడుగిడిన అనతి కాలంలోనే తన ప్రతిభా పాండిత్యాలతో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకును 'కవి గారు'- 'ప్రియాంశాలు' పేరుతో మనకు మరో కవితారత్న పేటికను అందిస్తున్నారు. ఇది, ఆత్మీయులు అక్షర తపస్వి డా॥ పోతుకూచి సాంబశివరావు గారికి అంకితంగా, పోతుకూచి సరస్వతీ పీఠం నుండి వెలువడటం ముదావహం అభినందనీయం.

కవిగారు సంస్కృతాంధ్రాంగ్ల ఉరుదూ భాషా కోవిదులు కావడంవల్ల ఆయన రచనలెప్పుడూ ఆలోచనామృత ధారల్లాగ ఉంటాయి. అచ్చమైన కవిగా నలుగురికోసం కరిగిపోతూ, తనకు తోచిన పరిష్కారాన్ని కవితగా నలుగురి హృదయాలకు పంచుతూ యాత్ర సాగిస్తున్న కవిగారి దీక్షాదక్షతలు చాలా గొప్పగా కనిపిస్తున్నాయి.

అనురాగం
అందమైన
ఒక రోగం— అనటంలోని సమత్వయోగంగానీ, కాలుష్యాన్ని గూర్చి చెపుతూ—

"దండిగ అందరికీ ఉన్న
ధనదాహ కాలుష్యం" అనటంలోని సత్యకథనంగానీ, దేవభాషని ప్రస్తావిస్తూ—

"సంస్కృతాన్ని జాతి భాషగా మలిస్తేనే తప్ప
చనిపోతున్న సంస్కృతికి మోక్షం లేదు" అనటంలోని ప్రగాఢ జాతీయాభిమానంగానీ- ఇటువంటివి ఇంకా ఎన్నెన్నో యీ సంపుటిలో కవిగారి భావ గాంభీర్యాన్ని తెలుపుతూ వున్నాయి.

ధీమాన్యులకు సైతం అందనంత ఉన్నతంగా ఆలోచనచేసి సామాన్యులు సైతం ఆనందించేటంత సరళ సుందరంగా రచన చేయటం కవిగారి ప్రత్యేక లక్షణం.

ప్రియాంశాలు. కవితల్లో ఈనాటి సమాజం ప్రతిబింబిస్తూ ఉంది. వరకట్నం వంటి సమస్యలతోపాటు మనిషిలోని అవగుణాల్ని, దుర్గుణాల్ని, బలహీనతల్ని తూర్పారబెట్టి, పరిష్కార మార్గాల్ని సూచించే పద్ధతి ప్రశంసా పాత్రంగా ఉంది.

స్వార్థ రాజకీయాలవల్ల, కుహనా న్యాయ వ్యవస్థలవల్ల, దోపిడీ విధానాలవల్ల, అమానుష అక్రమ ధనార్జనా విధానాలవల్ల కుటిల సంబంధాలవల్ల, ప్రజల్లో గూడుకట్టుకొని వున్న అజ్ఞానంవల్ల, అసమర్థత వల్ల నేటి సమాజంలో చెలరేగుతున్న అశాంతిని, అభద్రతాభావాన్ని రూపుమాపి,మానవత్వం నింపి మనిషిని మానవునిగా మలచాలనే తపనే ఈ 'ప్రియాంశాలు' సంపుటికి మూల సూత్రం. లక్ష్యం మహత్తరమైనప్పుడు, లక్షణం కూడా మహత్తరంగానే ఉంటుంది. కవిగారిలో విశ్వశ్రేయోభావ లక్షణం ప్రమాణాలకు అందనంత దూరంలో పారిజాత ప్రసూనంలా పరిమళిస్తూ ఉంది.

'కవి' అనే శబ్దం చాలా గొప్పది. "కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అని జగద్రచయితయైన పరమాత్మకు పర్యాయ పదంగా వేదం "కవి" ని పేర్కొంది. ఆ ఈశ్వరీయ రచనాంశ గలవారంతా కవులే అవుతారు. ఆ అంశాలే విశ్వరూపియైన ఈశ్వరునికి ప్రియాంశాలవుతాయి. కవిగారు ఆ మార్గాన పయనిస్తున్న ధన్య జీవులు.

"గుణదోషమయం విశ్వమ్", కాబట్టి ఎందులోనైనా గుణ దోషాదులుంటాయి. దోష మార్జనంతో, గుణాదానం చేసుకోవటం కర్తవ్యం. అందులోనూ, కళా జగత్తులో ఈ అవసరం చాలా ఉంది.

"Never Judge a work of art by its defects"

అనే ఆంగ్ల సుభాషితం నాకెంతో నచ్చింది. నేనీ ప్రియాంశాల్లోని అప్రియాంశాల జోలికి పోవటం లేదు. "న బ్రూయాత్ సత్య మప్రియమ్" అని మను శాసనం. కవిగారు లోకజ్ఞులు. లోకరీతినిబట్టి వారి కలం సాగుతూ వుంది. ప్రయోగాల్ని, పరిష్కార మార్గాల్ని లోకం తొందరగా అంగీకరించదు. అది చరిత్ర చెపుతున్న సత్యం కాబట్టి వేచి చూడాల్సిందే!

కవిగారు ఉత్తమోత్తమ కవితా సంపుటాలతో తెలుగు భారతిని అలరించి, కీర్తిమూర్తులు కాగలరని ఆశిస్తూ అభినందనలు తెలియచేసుకుంటున్నాను.

29-9-97

విబుధజన విధేయుడు
ఆచార్య తిరుమల

# హితాంశాలు

"హితేన సహితం సాహిత్యం" అనగా సాహిత్యము మేలు కూర్చునట్టిది అని. ప్రీతిదాయకమైనది, నీతిదాయకమైనదని కూడా సాహిత్యాన్ని చెప్పవచ్చు.

సర్వజనీనము, సార్వకాలికమునయి కవి యొక్క ఆత్మీయతను స్ఫురింపచేయుచు రసప్రధానమై ఆనందప్రదమైన కావ్యజాలమే సాహిత్యము.

సాహిత్యము మానవుని అంతరంగ జగత్తునకు సంబధించినది. హేతు విశ్లేషణలకతీతమైనది.

కవి ఆత్మీయత నుండి, వ్యక్తిత్వము నుండియే కావ్యముద్భవిస్తుంది. అందుకని అతని రచనలలో ఏ రచనకారచనను విడిగా చదివి అందలి స్వారస్యమును గ్రహించాలి.

అలనాటి ప్రాక్ నన్నయ యుగం నుంచి నేటి ఆధునిక యుగం వఱకు ప్రక్రియా విశేషం ఏదైనా సమాజ హితాన్ని మాత్రమే లక్ష్యంగా పెట్టుకొని అక్షరాలను, కృతులను మానవ కళ్యాణ శ్రేయస్సు దృష్ట్యానే సాహిత్యాన్ని అపురూపంగా అందిస్తూ వచ్చారందరూను. సాహిత్యమంటేనే మానవత్వం. "ఇజం కంటె హ్యూమనిజం గొప్పది" మానవతా సహితమైన సాహిత్య రచనల వల్లనే సమాజం ఆటుపోటులకు తట్టుకొని పదికాలాల పాటు పచ్చగా ఉంటుంది.

ఇటువంటి ఉదాత్త లక్ష్యాలు, లక్షణాలు, హ్యూమనిజం పునాదిగా కవిగారు వ్రాసిన కావ్యమే ఈ "ప్రియాంశాలు". ఇది కవిగారు వ్రాసిన నాలుగో కావ్యం. ఇందులో అందరికీ ఏదో ఒక "ప్రియాంశం" వుంది. జీవితపు విలువలు, జీవితంలో నేర్వతగ్గ విషయాలు, ఆచరించతగ్గ విషయాలు, ఆలోచించవలసిన విషయాలను కరతలామలకంగా చెప్పారు. ఇవి అందరికి, ప్రియము, హితము కూర్చే విషయాలు.

మచ్చుకు కొన్ని ప్రియాతి ప్రియమైన అంశాలు చూడండి:-

"సవాల్" లో "బ్రతుకు ఆశ వదలినపుడు సవాలే నా ఊపిరి" అంటారు. ఎంత ఆశావాదం? "విజయం మనదే" లో "క్రీడా నియమాలాచరిస్తే క్రీడా భావం చూపిస్తే-క్రీడోల్లాసం ప్రదర్శిస్తే ఓడినా మనం గెల్చినట్లే" స్పోర్ట్స్‌మాన్ స్పిరిట్‌కు ఇంతకన్నా చక్కని నిదర్శన ముంటుందా? "ఆచరణ" అన్న శీర్షికలో

"నేర్వాలని ఉన్నవాడు
నేర్వగలడు ఎంతైనా
నేర్చుకొనుట సులువే
నేర్పుటయు సులువే
నేర్చిన దాచరించుటయే
నిజంగా అతి కష్టం"

ఆచరించటం జీవితంలో ఎంత ముఖ్యమో గమకంతో చెప్పారు.
ఆవేశం" అన్న గేయంలో

ఆవేశం తగ్గినాక
చేసితివా ఆలోచన
నీకు నీవె శత్రువుగా

నిలిచి పోదువెపుడైనా" — ఆవేశం వల్ల వచ్చే అనార్థాన్నెంత అవలీలగా అర్థవంతంగా చెప్పారో?

కవిగారి ఈ ప్రియాంశాలు వారినే కాక చదువరులను కూడా ఆలోచింపచేసి ఆచరణాత్మత కున్ముఖులను చేస్తాయని నా నమ్మకం.

కవిగారి కలంలోంచి ఇంకా ఎన్నో కావ్యాలు వెలువడాలని, వారు పాఠకుల హృదయాల్లో కలకాలం నిలవాలని, వారిలాగే సందేశాత్మకంగా వ్రాస్తుండాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

సాహితీ లోకంలో కవిగారు తనదైన బాణీలో ఒక ప్రత్యేకమైన స్థానం పదిలపరచుకుంటున్నారు. వారి ప్రతిభా పాటవాలకు, సాహితీ పిపాస సేవాభావాలకు వారు నెలకొల్పిన "పోతుకూచి సరస్వతీ పీఠమే" నిదర్శనము.

వారి సహధర్మచారిణిగా, వారు సాహితీ రంగంలో శిఖరాగ్రాలు అధిరోహించాలని ఆ చదువుల తల్లిని వేడుకుంటున్నాను.

22-9-97

"విద్యారత్న", "ఉపాధ్యాయరత్న",
"వనితారత్న", బహుకళా కోవిద"
**డా॥ ఆకునూరు స్వర్ణలత**

# 1. ప్రార్థనా గీతి

అన్ని చరా చరముల
అన్ని జీవ జాలముల
సృష్టికారకా దేవా
సర్వశ్రేష్ఠ సకలబల ః

భౌతిక అధ్యాత్మిక విజ్ఞాన జ్ఞానాలతో
ధీశక్తిని తేజపరచు దేదీప్తులతో
ఆనంద సముద్రా అన్నమిచ్చు పోషకుడా
ప్రాపకమునకు మేము నిన్ను ప్రార్థిస్తాం నతులతో

ఆర్థిక పరమార్థిక విజ్ఞాన జ్ఞానాల
అనుదిన మడగకుండ వృద్ధిచేయు నీలీల
ఆరోగ్యము అందరికి అందించగ నీవు
ఆనందం పొందుతాము ఆచరించి మంచి పనుల ః

---

(ఓమ్ తమీశానం జగతస్తస్థు షస్పతిమ్
తియం జిన్వ మావసేహు మహేవయమ్
పూషానో యథావేద సామ సద్వృధే
రక్షితా పాయురదబ్ధః స్వస్తియే ః)

(స్వేచ్ఛానువాదం) ఋగ్వేదం 1-6-155

# 2. ధ్యేయం

నల్గురినీ
నవ్వించుట
నా జీవిత
పరమ ధ్యేయం!

నల్గురికీ
సాయపడుట
నా చేతల
నర్మ భావం!

నల్గురకూ
హృదిపంచుట
నా కవితల
నడత విధానం!

నల్గురునూ
ఎదుగ చూచుట
నా కన్నుల
ఎద ఆరాటం!

నల్గురికై
కరిగిపోవుట
నాకు సదా
మహదానందం!

# 3. క్రాంతి గీతి

సకల బలా సంరక్షించు
సర్వ జనుల నారాధించు
ఒకరిని ఇంకొకరము
కాపాడగ కరుణించు !

అన్ని గొప్ప ఆలోచనలే
బుద్ధి జ్ఞాన సామర్థ్యాలే
ఇమ్ము మాకు మేము
కరుణాశుల మౌదుములే !

మా జ్ఞానము విజ్ఞానము
వెలుగు లీన ప్రపంచాన
ఈర్ష్యా భయ విద్వేషము
చొరకుండా మాలోన !

శాంతీ ప్రశాంతి కరుణ
కాంతీ క్రాంతీ దిశలు నిండ
కాపాడగ ఎల్లరినీ
కలవాడవు నీవేనయ !

శాంతి శాంతి శాంతిః

(ఓం సహనావవతు శ్లోకానికి స్వేచ్ఛానువాదం)

# 4. అమలెరుగని శాసనాలు

శాసనాలు చేయగానె
చక్కబడదు సమాజం
కోకొల్లలు మూర్ఖజనులు
కావాలని నిర్భయంగ
శాసనాలు లెక్కించక
వాటి నతిక్రమించినపుడు
తగిన శిక్ష వారికేసి
తగురీతిగ బుద్ధి చెప్పి
శాసనాల నమలుపఱచు
చిత్తశుద్ధి మనకు లేదు!
ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు
మద్యపాన నిషేధాన్ని
మనమంతా ముద్రవేయ
మన ప్రభుత అమలు చేసె!
ఇంకా ఎన్నెన్నో శాసనాలు
కాలదోషం పట్టిపోయి
కాగితాలలో మూల్గుచుండె!
చట్టాలు న్యాయాలు
మనవి నామ మాత్రాలు
కొంతమంది స్వార్థపరులు
కొందరు దేశ ద్రోహులు
ఎటు త్రిప్పితే అటు తిరిగే
ఏ ప్రాసి మరబొమ్మలు
అందుకనే చట్టోల్లంఘుల
చేతలవే చట్టాలుగ
అందుకనే న్యాయ విరోధుల
నడతలవే న్యాయాలుగ
చలామణి ఔతున్నవి
ఇలా సమాజమేడ్చింది!
నా చిన్నప్పుడనేవారు
మామబావి అల్లుడు చేదయని
ఏభై సంవత్సరాలు
ఈ రీతినె గడిచిపోయె
ఈ సమాజ పరిస్థితి
యేమాత్రం మారదాయె
నేటికి ఆ లోకోక్తి
అంతగానె నిజం కదా?
చేదబావి అమ్మాయి తండ్రి
చేదబకెటు అత్తగారు
చేంతాడు పతిదేవుడు
చేదువాడు మామగారు
అమ్మాయికి పుస్తెతాడు
మన మేసే ఉరిత్రాడు
నాశ్వశూరుడూ నేనుకూడ

నా అల్లుడు కొడుకు కూడ
దీని పరిధిలోనికి రాము
అంతా ఆదర్శ వంతులము!)
ఎంత నిశ్చలం మన పురోగతి
ఎంత స్పష్టం సమాజం అధోగతి!
జరిగినదేదో జరిగినది
దానిగూర్చి విచారించక
ఇప్పటికైనా మేల్కొని మనం
మద్య నిషేధంలాగానే
కట్న నిషేధం కూడా
కఠినంగా అమలు చేసి
మన బిడ్డల కన్నీరును
మనకుండా చేసేద్దాం
వరకట్నం చావులను
ఇకనైనా ఆపేద్దాం
మహిళ మనుగడే ముప్పుచేయు
భ్రూణహత్యల నాపేద్దాం!

చట్టాలను అమలుచేయు
సత్తా మనకుందని
నిరూపించుకొందాం!
ఆంధ్రులమనిపించు కొందాం!
(ఇది వ్రాసి అచ్చేసే మధ్యలో
మద్య నిషేధాన్ని ప్రభుత్వం
నీరు కార్చివేసింది
నిశ్చేష్టుల మనల చేసింది.)
ఈ స్థితిలో మనకు దిక్కు
ఒకే ఒక్క చిన్న ట్రిక్కు
చదవండీ నే ప్రతిపాదించే
సదాచార సృష్టి గిమిక్కు!
తిరగేయండీ పేపరు
బిర బిరా చదవండీ
ఆలోచించండి నూవరు
అమోఘ ప్రతిపాదనండీ!

11-4-95

# 5. సదాచార సృష్టి

ఇక్ష్వాకుల నాటి నుండి
ఇదే కదా ఆచారం
కొడుకు పెళ్ళి అవగానే
కోడలింటి కొచ్చెయడం
పుట్టిన ఆ రోజు నుండి
ముద్దూ ముచ్చటలతో
మోదం మురిపాలతో
పెరిగినట్టి కన్నెపిల్ల
తల్లీ తండ్రీ తోబుట్టువులూ
తన ముద్దు స్నేహితులూ
తనకెంతో నచ్చినట్టి
ఘనమైన పరిసరాలు
అందటినీ వదులుకొని
అన్నిటినీ వదిలిపెట్టి
ఆశయాలు అల్లుకొని
ఆశలెన్నో పెట్టుకొని
అత్తవారి యింటిలోకి
అడుగుపెట్టు కదా తాను
లక్షలతో వచ్చినట్టి
లక్ష్మిదేవినిలాతనను
కొన్ని రోజులే కదా
కొలుస్తారు కోడలిని
ఆపై వ్యవహారం
అంతా షరా మామూలే
ఇదీ అదీ తెమ్మనో
ఇంకా కట్నం తెమ్మనో
ఇంటెడు చాకిరీని
ఒంటరిగా చేయమనో
ఆయమ తలిదండ్రుల
ఆ యింటి యితరులనూ
రోజంతా ఏకధాటిగ
రాజుకొంటు తిట్టడమో
ఇలా ఇలా యింకెన్నో
ఘోరమైన నేరమైన
వాడి వాడి మాటలతో
వల్లమాలు చేతలతో
కోడలికిక కష్టాలు
కో అంటే కోటులుగ
ఆరంభం అవుతాయి
హద్దులన్ని మీరుతాయి
ఆపైన కూడ ఆగకుండ
ఆమెను కాల్చేస్తాయి
ఇలా ఇలా ఏండ్లకొద్ది
ఎన్నెన్నో పూండ్లకొద్ది
మన మన అమ్మాయిలు
తమ తమ కష్టాలను
కనీసం మనతోనైనా
వారి స్నేహితులతోనైనా
చెప్పకుండ దాచిపెట్టి
అత్తా ఆడబిడ్డల
ఆరళ్ళను పడలేదా!
అంతకన్న దుర్భరమగు

బ్రతుకులే బ్రతకలేద !
ఏమి ఎఱుగనట్లు తాను
ఏమి తాను చేయకుండ
తన వారి సందరినీ
వెనకేసుకు తననేమో
చీటికీ మాటికీ
చిన్న చిన్న వాటికీ
సర్దుకు పోవాలని
శాసించే పతి దేవుడు !
భార్యమాటలనె వేదంగా
భావించే మామగారు
కొడుకులకీ రహస్యం
చెప్పనట్టి సన్యాసులు !
తమ బిడ్డల ప్రతిదానికి
క్షమించి వెనకేసుకు
వచ్చేతన అత్తమామలు!
ఇదే తమకు అదుననీ
ఒదినా మరదళ్ళను
అన్నదమ్ముల ప్రేమలను
అలుసుగా తీసుకుని
రాచి రంపాన బెట్టు
రక్కసాడ బిడ్డలూ!
తమబిడ్డల నతిప్రేమగ
ఇతర తల్లి బిడ్డలైన
కోడళ్ళను కొరకొరగా
చూచుతల్లి ఆడదే!
అత్తపెట్టు కష్టాలను
అనుభవించు చున్నదీ
ఎదురుమాట చెప్పకుండ
బెదిరి బెదిరి చస్తున్నది
కంటనీరు క్రుక్కుకొని
కలత పడేదాడదే !
అత్తా చూడబోతె
అ యింటికి కోడలే
ఆమెయునూ ఆడదే
ఈమెయునూ ఆడదే!
తల్లికొంగు పట్టుకొని
తనకేమి పట్టనట్లు
తల్లి చెల్లి కల్ల బొల్లి
తప్పుడు మాటలు విని
వారివైపు మాట్లాడే
తప్పుడు తనయులు!
నాకెందుకు లేయని
నంగి ఆడదానిలా
కూతురు లాంటిదైన
తన భార్య సమానంగ
తన యింటి దీపమైన
తన కొడుకు ప్రాణమైన
కోడలి కష్టాలను
చూసి కూడ చూడనట్లు
ప్రక్కకు తప్పుకునే
పాపాత్ములు మామగార్లు!
యుగ యుగాలుగా
తరతరాలుగా
ఇవే ఇవే కదా
అమ్మాయిల కన్నీటి గాధలు
ఇంత జరిగినా కూడా
మీకు తెలియనే లేదా

ఆడదానికాడదే
ఆగర్భ శత్రువని
ఆడదాని కష్టాలకు
ఆడదే కారణమని
చేతగాని మొగుళ్ళను
చేతబడి చేసినట్లు
చేతులలో పెట్టుకున్న
చేవలేని కొడుకులను
చూచుకొని ధైర్యంగా
ఆటలాడు అత్తలను
అదిరించి బెదిరించి
ఆటలనూ కట్టించి
తమ తమ కాపరాలను
తామే నిలబెట్టుకోలేని
తరుణమందు నాకొక
తగిన మంచి ఉపాయం
తళుకుమని తట్టింది!
వివరంగా వినుకొనండి
వినుకొని వేగంగా
విషయాన్ని గ్రహించండి
ఆచరణ చేయండీ
ఆంధ్రులమనిపించుకొండి
ఈనాటి నుండి మీరు
ఆచరించవలయునిదే
కొడుకు పెళ్ళిచేసి మీరు
కోడలినీ తెచ్చుకునే
ఆచారం ఆపండీ
చేయండీ సదాచారసృష్టి!
కూతురు పెళ్ళిచేసి మీరు
అల్లుని నాహ్వానించండి
ఆడపిల్ల కష్టాలను
అర్జెంటుగ ఆపుకొండి!
(ఎందుకనీ అంటారా
ఏ తల్లి తన కూతురును
అష్టకష్టాల పెట్టదు
రాచి రంపాన పెట్టదు
అల్లుని కొంగున ముడేసి
ఆడంగిగా చూడలేదు!
ఇక తండ్రీ కొడుకులంటారా
ఎంతగా వారికి సయోధ్య
ఎందరు తండ్రీ కొడుకులు
ఒకరితో ఒకరానందులు
కొడుకుల పంపించేస్తే
కోడళ్ళత్తలకు దూరం
అంతే కోడళ్ళంతా
ఆరళ్ళకు దూరం!
కొడుకులు దూరమైతే
తండ్రులకూ శాంతిమయం
కొడుకులనగ వినం!
ఆడబిడ్డల కళ్ళలో
అశ్రువులూ మనం కనం!
ఇందరు సంతోషించే
కుందనమీ ప్రతిపాదన
ఎందుకాచరింగకూడదు
అందరానందంగా ఉండకూడదు?

# 6. ఎటుపోతున్నాం - ఏంకానున్నది ?

చట్టాలు మనదేశంలో
కలవారికి చుట్టాలు!
న్యాయాలు మనదేశంలో
నత్తనడక నమూనాలు!
పెళ్ళిళ్ళు మనదేశంలో
కట్నాలతో కలుషితాలు!
ఎవరికేం చేసినా
నాకేం లాభమనుకొనే
దౌర్భాగ్యపు దశను
మనకు ప్రసాదించినట్టి
అరశతాబ్ది అభివృద్ధి
పెంచినది కుళ్ళుబుద్ధి
ప్రజల మేలు వట్టనట్టి
ఆయారాం గయారాం
అనదగిన ప్రభుత్వాలు
బోఫోర్సులూ, బొగ్గు కేసులు
హర్షద్ మెహతాలూ
కృష్ణపట్నాలూ ఎన్రాన్‌లు
పశుగ్రాసం మోసాలూ
ఎం.పీల కొనుగోలులు
ఎరువులలో మెక్కుడాలు
నీతికొరత కారణాలు
నేటి అన్ని కుంభకోణాలు!
ఎన్ని జరిగినా వాళ్ళను
యేంచేయలేని ప్రభుత్వాలు!
నిన్న వచ్చి నేడు రెచ్చి
రేపు కోట్లు ఆర్జించే
మధ్య దళారీలు, మన
మధ్యనే ఉన్న కాంట్రాక్టర్లు
మన ప్రజాశక్తి దోచి
మన ప్రజా భుక్తి దోచి
వారినెదుగ నీయకుండ
వారినలానే వుంచి
రాత్రిళ్ళకు రాత్రిళ్ళే
రతనాలను ప్రోదిచేయు
రాక్షసులై దాపురించి
దేశాన్నే మింగేసే
దినము మనకు వచ్చె కదా!
ప్రజల ఆలనా పాలనా
పట్టని మన ప్రతినిధులూ
తమ తమ కుమ్ములాటలలో
తలలను యిరికించుకు
నత మత మౌతున్నారే తప్ప
మనలగూర్చి పట్టింపేదీ
మనకై వెచ్చించు సమయమేదీ?
అన్యాయాలూ అక్రమాలు
పట్టించుకోని అధికారులు
ప్రజల మేలు చూచుటకే
వేతనాలు పొందికూడ
వారి గోడు వినని వారి
మాట చెవిని పడని
మన ప్రజా సేవకులు,

రోగం కుదర్చమని
శరీరాన్ని అప్పగిస్తే
అవయవాలు మాయంచేసి
అమ్ముకునే నికృష్టులు!
చదువు చెప్పమని జీతాలిస్తే
అవి తేరగా మింగి త్రేన్చి
ఇంటివద్ద డబ్బు గుంజి
చదువు నమ్ముకొనే
దగుల్బాజి మేస్టార్లు!
న్యాయంకై ఆశ్రయిస్తే
పాట్లెన్నైనా పడి
గడ్డెంతైనా తిని
అన్యాయాన్ని గెలిపించే
అష్టమైన న్యాయ కాపరులు!
కాంట్రాక్టర్లతో ఉపకారం పొంది
తప్పుడు పనులు చేయు
సాంకేతిక శాస్త్రీయ నిపుణులు!
పాలనకన్నా తమకు తామె
సాయపడే పరిపాలకులు!
ప్రజల శాంతి భద్రతలే
పట్టని రక్షక సిబ్బందులు!
ఇలా చెప్పుకుపోతే
ఎన్నెన్నో ఘోరాలు
ఈ వ్యవస్థ మారేనా
మన అవస్థ తీరేనా
రామరాజ్య మొచ్చేనా?
రానప్పుడు వ్యవస్థపై
తగుల బెట్టు కొటానుకోట్లు
ప్రతిరోజూ జరిగే
ఎలక్షన్ల పాట్లు, ప్లాట్లు!
అమాయకుల మరణాలూ
మారణ హోమాలు
అన్యాయాలక్రమాలు
దుర్మార్గ ద్రోహాలు
ఇచట యేది చూస్తున్నా
ఏమున్నది దుఃఖ కారణం.
ప్రజల పనులలో దేశంలో
ప్రజల కందుతున్న దెంత?
దేశ సౌభాగ్యంలో భాగంగా
ప్రజలు పొందుతున్న దెంత!
ప్రజ్వరిల్లు పరిస్థితులే
ప్రజావళి ఆక్రందనలే
ఆరాటాలై పోరాటాలై
ఎదురు నిలిచి ఉరిమితే,
ఈ వ్యవస్థ గతి యేమిటి?
బ్రతికి బట్ట కడుతుందా
లోకముడిచి పోతుందా
మరే వ్యవస్థ వస్తుందీ
మన చీకటి పోతుందీ
మనకు వెలుగునిస్తుందీ
మన ఆశలు ఫలిస్తాయి
ఆశయాలు సిద్ధిస్తాయి
ఆ దినాన్ని ఆహ్వానిద్దాం!
ఆ రోజుకు ఎదిరి చుద్దాం
అది వచ్చిన మరుక్షణం
అలస్యం చేయకుండ
అనురాగం నైర్మల్యం
పునాదులుగ వేసుకొని
ఆదర్శవంతమైన
జాతినొకటి నిర్మిద్దాం!
దేశమాత గౌరవాన్ని
దిశలనెల్ల చాటుదాం!

# 7. నవ నారీమణులు

పడేటపుడు సంభాళించి పతనమాపవచ్చు
పడేటపుడు ప్రయత్నించి పతనమాపవచ్చు
పడేటపుడు ఆలోచించి పతనమాపవచ్చు
పడేటపుడు ధైర్యంతో పతనమాపవచ్చు
పడేటపుడు శక్తితోడ పతనమాపవచ్చు
పడేటపుడు యుక్తితోడ పతనమాపవచ్చు
పడేటపుడు ఊహకలుగ పతనమాపవచ్చు
పడేటపుడు నీతిదూరు పతనమాపలేము
పడేటపుడు ధర్మదూరు పతనమాపలేము
పడేటపుడు దుర్మార్గుల పతనమాపలేము
పడేటపుడు మోసగాని పతనమాపలేము
పడేటపుడు మనవరుల పతనమాపలేము
పడేటపుడు ఆ జారుల పతనమాపలేము
పడేటపుడు త్రాగుబోతు పతనమాపలేము

ఆగుమిక చివరి అసంభవాన్ని
ఆంధ్రుల ఆడబడుచులూ
ఆంధ్ర కాళిలు రుద్రమలూ
ఆంధ్రావని నారీమణులు
సంభవము చేసినారా లేదా?
త్రాగుబోతు ఆంధ్రుల ఆటలు కట్టించిరి
తూగడం సుతరామూ మాన్పించిరి
ఆంధ్ర మహా బహుజన పతనము నాపిరి
అందుకే మళ్ళీ ఆ స్త్రీ శక్తిని ఆవాహన చేయడం
అన్యధా శరణం నాస్తి అని మళ్ళీ అర్థించడం
మన మహిళా మణులందరు మరోసారి మరోసారి ప్రతిసారి
మహాతంగా విజృంభించి కదం త్రొక్కి పదం పాడి
కాళరుద్రమలై వరకట్న దురాగతాలూ
నీతి ధర్మదూరత్వాలు, మోసాలు దొంగతనాలూ
దుర్మార్గాలు తమపై దౌర్జన్యాలూ, జటిల పాప జారత్వాలూ
ఆపితే తప్ప........ ఆగవేమో మనభూమిని ఆగదేమో ఈ పతనం

# 8. ఆలోచించండి

పుస్తె కట్టు ముందు వరుడు
పుచ్చుకొనును కదా లక్షలు
అయినా కూడా కాపరాలు
అగుచున్న వేమి ముక్కలు
తన వ్యామోహం తీరగనే
తనకిక వద్దని భార్యను
తన్ని తగుల వేయుకదా
విడాకులే కోరుకదా
ఇంకో పెళ్ళిని తాను
ఎంచక్కా ఆడవచ్చని
తిరిగి కట్న రాసులను
తాను ప్రోగు చేయొచ్చని
పుస్తెకట్టినపుడు తాను
పుచ్చుకొన్న ఆ లక్షలు
పుస్తె తీయ పూనినపుడు
చెల్లించడేం అమ్మాయికి
ప్రతి ఆడబడుచు నేడు
ఇలాంటిదే ఓ షరతు
తా విధించగలిగితే
మనలాంటి పెద్దలంతా
దానికి వంత పలికితే
మ్రింగిన ఆ యమ ధనమును
క్రక్కలేక దిక్కులేక
ఆ యమతో బ్రతుకుటకే
ఆకర్షితుడగునేమో?
ఆ పైనైనా తాను
ఆదర్శంగా బ్రదుకునేమో?
విరుగుతున్న కాపురాలు
తిరిగిచక్క బడునేమో?

# 9. విశ్వ మానవులు

బాలల బాలలలాగే ఉండనివ్వండి
వారినీ క్రూర వాతావరణానికి లాగకండి
పక్షులలా వారి నాకసాన విహరించనీండి
పంజరాలలో వారినసలే బంధించకండి
ఎల్లలే లేని నిన్నటి మన భూమి గురించి
ఎంతో వివరంగా వారికి నేర్పించండి
మనుషుల దూరం చేసే గుండెల గురించి
మరీ మరీ అది పాపమని చెప్పండి
వికసించే పుష్పాల్లా హసిస్తూ ఎదగనీండి
యుద్ధాగ్ని కీలలకాజ్యం కానివ్వకండి
భూతకాలమెలాగూ అయింది భూతం
భవిష్యత్తునన్నా కాపాడుకుందాం
పెద్దల ఆటలలో లేదు వారి ఆనందం
ఆ ఆటలు వారికి భయభ్రాంతి కారకాలు
మనం మానవత్వ మెలాగూ విడిచాము
పశువుల కన్నా హీనంగా ప్రవర్తిస్తున్నాము
బాలలను బాలలలాగే ఉండనివ్వండి
వారి చిన్ని హృదయాలు బందీ కాకుండా
ఎల్లలనన్నిటినీ చెల్లా చెదరు చేసి
విశ్వమానవులయేలా పిలుకలిగించండి!

(షీతల్ మోర్జారియాకు కృతజ్ఞతలతో)

22-3-96

# 10. ఆంధ్రుడు

ఆరంభ శూరత్వం
ఆంధ్రులకో వరం
ఆరంభం లేనిదే
అంతమెలా సాధ్యం!

చక్కని ఆరంభమే
సగం కార్యసాధన
మనల మనం తెగడడమే
మన దుర్భర వేదన!

ఆంధ్రుడు విశ్వామిత్రుని
అంశా సంతతి- అందురు
ఆంధ్రుడసలే లేని
దేశమూ లేదందురు!

అలాంటపుడు గొప్పవాడు
కాడెందుకు ఆంధ్రుడు
ఎలా మసులుతున్నాడు
ఎలా ఎదుగుతున్నాడు!

ఎంత కోపమెక్కువైతే
అంత ప్రేమ ఉన్నట్లే
ప్రేమ వున్నవారి మీదే
కోపం చూపుదురన్నట్లే!

కోపంతో చెప్పువారు
కోరుతారు అభివృద్ధిని
ముసిముసి నగవులతో కొందరు
ముంచుతారు కొంపలను!

ఆంధ్రుడు తానెపుడూ
అనంత విశ్వాత్మజుండు
అంతగ ప్రపంచాన
ఆదరింప బడుతున్నాడు!

# 11. నవ్వనా - ఏడ్వనా

ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా
ఒక మంచీ ఒక్క చెడూ
ఒకేసారి దూసుకొచ్చి
ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే
ఓర్మిని చంపేస్తుంటే
సమన్వయం కుదరకుండ
చచ్చినంత పనౌతుంటె
ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా!
నాకే ఎందుకిలా
నగు బాటౌతున్నది
నేనూ అందరిలా
కాదనా ఇటులౌతున్నది
అందరిలా నేనైతే
అందులోన గొప్పేమిటి
ఆదర్శంగా బ్రదికితే
అదేమైనా తప్పేమిటి
వెంట వెంటనే మంచీ చెడూ
విపరీతంగా బాదేస్తుంటే
ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా!
మంచి మరీ క్షణకాలం
చెడు మాత్రం చిరకాలం
మరీ మరీ జీవితాన్ని
మరణం వైపుకు లాగాటాన్ని
ఎవరి పనని చెప్పకోగలను
ఎలా నేను తప్పకోగలను
ఒక మంచికి నవ్వనా
ఒక చెడుకే ఏడ్వనా!

# 12. దేవభాష

సంస్కృతం తెలియక
సంస్కృతి హీనులై
వేదమే తెలియక
విధి, జ్ఞాన హీనులై!

ఆర్యులందరు తాము
అనార్యులై దుష్టులై
గొప్ప ఈ దేశాన్ని
కుప్ప కూల్చిరి కదా?

మానవులంతా ఒకటను
మాట తెలుపు కద వేదము
భూమంతా కుటుంబమను
బుద్ధి నేర్పు విజ్ఞానము!

ఎన్నిటికని బాధ పడతాం
ఎందరెందరిని తిట్టిపోస్తాం
దేశ భాషగా సంస్కృతం పెట్టని
దేశ నాయకుల దుయ్యబడతాం

ఇప్పటికైనా పోయింది లేదు
ఆలస్యమైనా సాధించలేంది లేదు
సంస్కృతాన్ని జాతి భాషగ మలిస్తేనే తప్ప
చనిపోతున్న సంస్కృతికి మోక్షం లేదు!



# 13. మోక్షం

వేద విజ్ఞానంలో ఓలలాడే బదులు
వాదపు అజ్ఞానంలో మునకలేస్తున్నాం
ముందుకు దూసుకుపోయే బదులు
పురోగతి వెనక్కు నెట్టేస్తున్నాం

ఇకనైనా మన తప్పులు దిద్దుకొని
ఈ దేశం బాధ్యత మనదేనని
మన సంస్కృతీ విలువల పునరుద్ధరించి
అనిపిద్దాం గొప్పజాతికి ఘన వారసులమని

ఇక్ష్వాకుల కాలం నుండి ఈ దేశ ఖ్యాతి
తెలియనిదా మనకు దీని ప్రఖ్యాతి
ఎందుకిలా నిర్వీర్యమైపోతున్నదిది
జాతులన్నిటి కన్నా సమున్నత జాతి!

లెక్కకున్నాం తొంభై కోట్ల జనం
ఒక్కడొక్కసారి నా జాతి నా దేశమన వినం
జపసీయుల సమయజ్ఞానం, జాతీయతా భావం
గుడ్డిగా ఆచరించిననాడే మనకు మోక్షం!

# 14. ఈశ్వరా

ఉగాదులిలాగే
వస్తూ పోతుంటాయి
ప్రభుత్వాలూ పడిపోతుంటాయి
అటు వాటితో
ఇటు వీటితో
ప్రజల కొరిగేది
బహు తక్కువ రెంటితో
పనికిమాలిన దేదైనా
పారవేయదగ్గదే
జనులకు మంచి చేస్తేనే
మనగలదేదైనా!
అట్టడుగు బడుగువానికి
అన్నమందితే ఉగాది
ఆనందం వెల్లివిరిస్తే
ఆనాడే మనకు ఉగాది
అభయంగా జీవించిన
ఆ దినమే ఉగాది
అంత కలసి మెలసి వున్న
అపుడే మనకుగాది
సంకీర్ణ ప్రభుత్వాలు
వంకర ప్రతిపక్షాలు
అన్నీ యిక చాలు చాలు
నియంతృత్వమే మేలు
ఈశ్వర ఇది నీ ఉగాది
ఇక నీవే దిక్కు మాకు
ఏంచేస్తావో ఈ ఏడాది
నీవైనా ముంచబోకు!

# 15. రెండు గురువులు

సుఖం కన్న దుఃఖాన్నే
సౌఖ్యంగా తలుస్తాను
మిత్రునికన్న శత్రువునే
మిక్కిలిగా ప్రేమిస్తాను
వెలుగుకన్న చీకటినే
వేయి రెట్లు కోరుతాను
బ్రదుకుకన్న మరణాన్నే
మరీ మరీ స్మరిస్తాను
గెలుపుకన్న ఓటమికే
విలువ చాల ఇస్తాను
జీవం కన్న జడాన్నే
జేజేగ భావిస్తాను
ధనికుల కన్న పేదలకే
దగ్గరగా వసిస్తాను
ఆకలితో కోపంలో
అదే రీతి ఏడుస్తాను
మొదటివి నాకు నేర్పింది
మోహాలని అంటాను
రెండవ ఉద్వేగాన్నే
రెండు గురువులంటాను:

అయ ఆచార్య సినారెగారి గజలు "సుఖమైనా దుఃఖమైనా" కు నూరుపాళ్ళ స్ఫూర్తితో.

# 16. ప్రత్యక్ష నరకాలు

ఇలలో నరకాలన్నవి
కలవన్నది తెలియదేని జ్ఞప్తికి తెస్తా
నిలయాల్ రక్షక భటులవి
ఆలయములు న్యాయాలవి, ఆస్పత్రులవిన్!

"సాయం చేయాలా యేం"
స్వామీ ఇదే మా ధ్యేయం
అంటూనే జనాలను పోలీసులు
అంతగ భయపెట్టడం!

మన న్యాయస్థానాలవి
మరీ సాలె గూళ్ళైనవి
చిరు క్రిములను చెరపట్టి
భూరి కీటకాలొప్పనిస్తవి!

మందులకై నిలదీస్తే
చిందులు త్రొక్కి జనాలను ఛీ కొట్టుచు మే
మెందుకు పని చేయాలని
సందు దొరకని వైద్యులు స్ట్రయికంటారేం?



# 17. గంతలిప్పాల్సిందే

కళ్ళు మూసుకుని చూసేదాన్ని
ఎల్లా అనగలం న్యాయమని
కుళ్ళు సాక్ష్యాలను నమ్మేదాన్ని
ఎలా వినగలం ధర్మమని!

అవసరమైతే న్యాయస్మృతి
అంతా తిరిగి వ్రాయాలి
అపవాదులపై శిక్షించురీతి
అన్యాయం మారాలి?

న్యాయదేవత కళ్ళు విప్పితేనే
న్యాయం లభిస్తుంది కోర్టుల్లో
సాక్ష్యాధారాలు సత్యమైతేనే
ధర్మం గెలుస్తుంది వ్యాజ్యాల్లో!

గుడ్డి సాక్ష్యాలను నమ్మని
గొప్ప ధర్మాధికారులుండాలి
నత్తనడక న్యాయాలకు
కొత్త పరుగులందించాలి!

అపుడే న్యాయస్థానాలు
అవుతాయి ధర్మాసనాలు
అవి వినిపించే శిక్షలు
అవుతాయి శిరోధార్యాలు!

# 18. వేడుకోలు

విరియని మొగ్గలు వెదజల్ల వాసనల్
దూరంపు భ్రమరముల్ చేరునటకు
కోయిలల్ కుహూ కుహూ రావంబు సేయగ
మహీ వసంతము వేగ మరలి వచ్చు!

పరుగెత్తు నదులెల్ల పాటలన్ పాడుచు
వారాసిలోపల చేరిపోవు
చీకటి కలదని చిమ్మటల్ దుఃఖించ
జ్యోతి మార్గము చూపు జ్యోతి యొకటి!

ప్రేయసీ దిక్కుమాలిన ప్రియుడనేను
నీ కౌఁటకు బాధపడుచును నిలిచియుంటి
గాతకము మేఘముల నిరీక్షణములోన
నీటికై ఆశతోడన నిల్చుభంగి!

(దిలీప్ కుమార్ రాయ్ ఆంగ్ల కవిత కనువాదం)
1957-58 లో ఇంటర్మీడియెట్ లో చేసినది



# 19. వేంల్లాపకు

నేటి రోజు
నీవొనర్చు
నీ మేలును
మరుదినమే
మఱచిపోవు
మహరాజులు
కో అంటే
కొందరా
కోకొల్లలు
నీవంతనె
నిరాశ ని
స్పృహ చెందక
నీ సుగుణాన్ని
నిరసించక
నీ మేలును
ఆపనే ఆపక
నిర్విఘ్నము
గానొనర్చు
నిండు మనీషివై
తరించు!

# 20. పోలిక

ప్రకృతికీ మనిషికీ
బహు విధాల పోలిక
ఉదయించే సూర్యునికీ
పోలిక మనిషి పుట్టుక!
ఉదయానిని పోల్చవచ్చు
మానవుని బాల్యంతో
మధ్యాహ్నం కాదా అది
యౌవనం మనిషికిలా
జీవితాన గట్టిపడి
జైజై అను సమయం
తీక్ష్ణతంత ఉట్టిపడి
తేజరిల్లు తరుణం!
సాయంత్రం వృద్ధాప్యం
చరమగీతి సమయం
అస్తమించు సూర్యునికీ
మనిషి అంతమే పోలిక
ప్రకృతికి మనిషికీ
బహువిధాల పోలిక!

# 21. కత్తులు దూస్తున్న కాలుష్యం

జగతిని పీడించే సమస్యలు
ప్రగతి కొని తెచ్చే దౌర్భాగ్యాలు
ఇన్నా అన్నా ఎన్నని చెప్పేది
కనుల యెదుట కాలుష్యాలు!

సమస్యలు తీర్చేందుకు మానవుడు
సతమతమౌతూనే ఉన్నాడు
ప్రగతిలో భాగంగా సమస్యల్ని
మానవుడేకొన్నిటినిసృష్టిస్తున్నాడు!

ముప్పులై మనపై దికిపుడు
ముంచుకొస్తున్న సమస్యలు
ముఖ్యంగా మూడే మూడు
వాయు జల ధ్వని కాలుష్యాలు!

కాలుష్యాలు జనులపై నేడు
కత్తులు దూసుకొస్తున్నవి
వదలక అమాంతం జనాన్నే
కబళింప తాము చూస్తున్నవి!

మన ప్రగతికి సోపానాలు
మన ఘన కర్మాగారాలు
మూడు కాలుష్యాలు పెంచే
ముప్పులకివి నిలయాలు!

కర్మాగారాలు విడిచేవి
దోషభూయిష్ఠ వాయువులు
చుట్టూ వుండే వారవి
చూడక పీల్చే విషాలు!

వీటి రసాయన విసర్జనాలు
నీట కలిసే నీచ విషాలు
త్రాగిన వారికి కలిగించు
తగ్గని వెన్నెన్నో రోగాలు!

పనిచేసే కార్మికులకు
ధ్వని కాలుష్యమే బ్రదుకు
చెవిటి వారిని, అవిటి వారిని
చేయందే వదలవు చివరకు!

పట్టణంలో చెత్త కాలుష్యం
వాహనాల ధూమ కాలుష్యం
పర్యావరణకాలుష్యం
పై మూడింటికితోడీరోజు!

అస్మదీయ కాలుష్యం
తస్మదీయ కాలుష్యం
లీకుల కాలుష్యం
స్కాముల కాలుష్యం!

ఆడా మగా అనకుండా
అనుసరించు కాలుష్యం
దండిగ అందరికీ ఉన్న
ధనదాహ కాలుష్యం!

కనులకందలేనంతగ
కాలుష్యమె కాలుష్యం
విష వలయాల కాలుష్యం
విశ్వవ్యాప్త కాలుష్యం!

కాలుష్యాల్ని ఆపడం
కాదేమో ఇక సాధ్యం
తీరం తిరిగి రాలేని
తెప్పలపై పోయాం!

జగతినేల మట్టమైతే
ప్రగతి తిరిగి ఆరంభిస్తే
తప్ప ఆగదేమో కాలుష్యం
అప్పుడేనా అందరికి మోక్షం!

# 22. ప్రమగ్గే బాలలు

కర్షకులూ కార్మికులూ
కలిసి నూటికి తొంభై మంది
దుర్భరాలు వీరి బ్రదుకులు
దోచేవారే వీరినెంతోమంది!

వీరికి కష్టపు ఫలితమందకుండా
వేరుచేయు పాపులు పరమనీచులు
కొల్లగొట్టే కోటీశ్వరులు
మధ్య దళారీలు యాజమాన్యాలు!

తొంభై శాతం పై వారిలో
తొమ్మిది శాతమైనా బాలలు
చదువుకొని వికసించాల్సిన
చైతన్య బాల కార్మికులు!

ఎంతో కొంత అన్నట్లుగా
వేణ్ణీళ్ళకు చన్నీళ్ళుగా
పదేండ్ల తమ పిల్లలనే
పనికి పురమాయించే తలిదండ్రులు!

బాల కార్మికులనే తాము
బహు యిష్టంగా వాడేవారు
చిల్లర డబ్బుల ఆశచూపి
పిల్లల రక్తాన్ని పిండుకుని

పెన్నిధులుగా మార్చుకొనే
ఇద్దరినీ ఎంచి నేరస్థులుగా
ప్రేతాలు యాజమాన్యాలు
ఇవ్వవలసినా కఠిన శిక్షలు
ఎంతో కొంత తామూ మ్రింగి
అంతగ పట్టించుకోని అమలుదార్లు

వీరినీ వారినీ విద్రోహులందర్నీ
వేసి జైళ్ళలో బుద్ధి చెప్పేంతగ
ఏనాడన్నా దేశంలో ఎదిగాయా
ఏమన్నానా న్యాయాలు చట్టాలు!

తప్పులు చేసేవారంతానూ
తగుదు మాయని తప్పించుకోగా
చిన్నారి బాల కార్మికులకేల
చేయని తప్పులకు శిక్షలు!

వీరికి శిక్షలు తప్పాలంటే
వేరే మార్గం లేనేలేదు
బాల కార్మికులు ఉండొద్దంటే
బహుశాః వేరే దారే లేదు!

పదవ తరగతి వరకు తప్పక
అమలు చేయడమే నిర్బంధ విద్య
అన్నిటికన్నా మించిన సూచన
ఆచరణయోగ్యమైన ప్రతిపాదన!

(అంశాన్ని సూచించిన ఆప్తమిత్రుడనదగిన బొంగు వేణుగోపాల రావుకు ఆప్యాయంగా అంకిత మీ రచన)

# 23. దేనికని స్వర్ణోత్సవాలు

దేశంలో స్వర్ణోత్సవాలు
దీనుల బ్రతుకులు దీనాతి దీనాలు
వస్తేనేం ఎన్నెన్ని ప్రభుత్వాలు
ఐతేనేం ఎందరు మంత్రివర్యులు!

ఏం సాధించాం ఇన్నిన్నేళ్ళు
రాజకీయాల్లో కంపు, కుళ్ళు
ఆదర్శులవ్వాల్సిన మంత్రులే
అవుతున్నారు గడ్డితినే వాళ్ళు

వారికి తోడు దొంగలై
వీరూ కొందరధికారులు
మింగుతున్నారు వెన్నలై
మీసాల కంటకుండా వెన్నలు!

దేశాభివృద్ధికి పెట్టే ఖర్చులో
ప్రజలకందాల్సిన సొమ్ములో
వారికందేది ఇరవై శాతమేనని
ప్రధానమంత్రే చెపితే ఏమనాలో!

బీదలు పొందాల్సిన సౌభాగ్యం
మీది నుండి క్రిందిదాకా సర్వస్వం
పంచుకుంటున్నారు మధ్యదళారీలు
ఇంతకన్నా ఉంటుందా ఘోరం!

గొర్రెలుగా ప్రబలను వారి
పుత్రెలు వాడకుండ నిరంతరం
నిరక్షరులుగా ఉంచితేనే
వారేలిన వారి ఓటు బ్యాంకులు!

అన్ని పార్టీలవారినీ గొర్రెలు
అజమాయిషీ చేసినారు
కోళ్ళు మింగే వారొకరైతే
గొర్రెల మింగేవారినీ చూసినారు!

ఈసారి ఓటేయడానికి
ఎవడూ మిగలలేదనడానికి
సందేహం లేకున్నా తప్పక
వేయాలికదా మళ్ళీ మొదటి వాడికి

ప్రజలను దోచుకొనే
బ్యాంకుల స్వాములస్వాములు
ఎంతమ్రింగి తేన్చినా
ఏం చెయలేని ప్రభుత్వాలు!

నేనేం చెయలేనని
నేరుగా ప్రధానమంత్రే
నుడివే రోజులొచ్చాయి
బడుగు దేశానిదిదీ బడాయి!

శతశాతం అక్షరాస్యత
సాధిస్తే తప్ప దేశానికి
మోక్షంలేదు ప్రజలకింత
న్యాయం జరుగదు బ్రతకనికి!

అవినీతెంతగ దేశంలో
అమిరి ఇమిడి పోయిందంటే
నిలబడలేకున్నాడీ రోజుల్లో
నీతిపరుడెవడన్నా ఉండుంటే!

ప్రజాస్వామ్యమీ దేశానికి
పనికి రాదనడానికి
వెనుక ముందక్కరలేదు
వేరే ఏ స్వామ్యం గతి దీనికి?

# 24. బీహార్ దోపకం - తీహారు దర్శనం

లాలూ ఉవాచ:-

సౌభాగ్యం బీహారుకు
ససేమిరా పట్టనియ్యను
యాదవుణ్ణి తీహారుకు
ఏ చట్టం చేర్చనియను!

పశుగ్రాసం మింగేసిన
ప్రసాదునండీ నేను
బీహారును మింగేయక
తీహారెళ్ళనండీ నేను!

మింగి నేను త్రేన్చుతున్నా
మీరు నన్నేం చెయగలరు
నా భార్య బలగాలన్నీ
నాపనినే చేయగలరు!

నన్ను కబడీ ఆడారు
తన్నావల పారేశారు
నేను రబడీ వాడాను
ఉన్నానచటే చూశారు!

లాలూ అంటే మజాఖా
చాలూ తెలుసా తడాఖా
క్రిందపడ్డా మీద పడ్డా
గెలుపే లెండి ఇలాఖా!

ఉట్టి పట్టుకొని కదా
ఊగాన్నే నిన్నినాళ్ళు
గట్టితనమిలాగుననే
ఉట్టి కుండునెన్నినాళ్ళు !

బీహారును విడువగనే
తీహారే ఇక గతి నాకు
స్వాహా స్వాములందరికీ
తీహారే తీయని సోకు !

కవి ఉవాచ:-

బీహారులో ప్రజాస్వామ్యం
బిక్క మొహం వేస్తున్నది
అంతగ మొనగాళ్ళ చెతుల్లో
అపహాస్యం పాలౌతున్నది

అనుకున్నంత అయ్యింది
అన్యాయం బేడీ లేసుకుంది
లేడీని చెసినా ముఖ్యమంత్రి
తేడా లాలూకు ఏముంది?

అంతటి బలాఢ్యుడు రావణుడే
అంత బిక్క చావు చచ్చాడు
పశుగ్రాసం నమిలిన వాడా
పాపం నెమరువేసుకో మూర్ఖుడా!

# 25. విజయం మనదే

జీవితమే ఒక క్రీడ
చిత్రముగా తరచిచూడ
ఎంత బాగా ఆడితే
అంతగ విజయం మనదే
ఆటలలో పాటలలో
అన్ని బ్రదుకు బాటలలో
మనవంతు కలిషినిచేసి
మహితంగా విజృంభించి
గెలుపగల మనుకొంటే
గెలిచి తీరినట్లే
పోటీలో పాల్గొన్న
ప్రతివాడూ గెలుస్తాడా
ఎందరో పాల్గొనేది
కొందరే కదా గెలిచేది
క్రీడలలో నిజంగా
గెలుపుకన్న ముఖ్యం
క్రీడా నియమాలాచరిస్తే
క్రీడాభావం చూపిస్తే
క్రీడోల్లాసం ప్రదర్శిస్తే
ఓడినా తాను గెల్చినట్లే
క్రీడలలో నిష్ణాతుడు
ఓడిననూ చలించడు
జీవితంలో అట్టివాడు
చివరకుత్తీర్ణుడౌతాడు!
జీవితమే ఒక క్రీడ
చిత్రముగా తరచి చూడ
ఎంత బాగా ఆడితే
అంతగ విజయం మనదే!

# 26. ధర్మమే గెలుస్తుంది

అహింసా వాదులము
అచ్చు శాంతి కాముకులము
అవనియెల్ల ఒకే కులము
అనుకొనే మానవులము
అన్యాయము అక్రమము
మోసందగా మూర్ఖత్వము
దుర్మార్గము దౌర్జన్యము
హింసా, క్రూర ప్రవర్తనము
అసలే నచ్చని వాళ్ళము
సిసలుగా వాటి శత్రువులము
అవసరమైతే వాటిని
ఆక్కడికక్కడే ఎదుర్కొని
అణగ ద్రొక్కడానికి మేం
అనవతరం సన్నద్ధం
కొనవూపిరి వరకు మేం
రణమునకైనా సంసిద్ధం!
దుర్మార్గం భరించినోడు
దుర్మార్గుడె ఔను చూడు
దౌర్జన్యం నెదిరించనోడు
దుర్జనునే పోలుతాడు
హంతకుణ్ణి ఆపనోడు
హంతకుణంతటోడు
ప్రాణానికి భయపడినోడు
పదే పదే కదా చస్తాడు
భయమనేది లేనివాడు
జయమునెపుడు వరిస్తాడు
ఆదర్శంగా నిలుస్తాడు
ఆఖరికొకసారే చస్తాడు
అవగుణాల ఆటకెపుడు
అవనిలో గెలువవు చూడు
ధరిత్రిలో ఎల్లప్పుడు
ధర్మమే గెలుస్తుందు!

# 27, నీకూ భయమేనా?

మింట నుండు భగవానుడు
కంటచూడడిటు వైపు
పాపాలు చేసినా
ఆపడెవరిని గూడ
దోపిడీలు దుర్మార్గాలు
అన్యాయాలక్రమాలు
దగా మోసం దౌర్జన్యాలు
ఎగాదిగా సాగుతున్నా
మారణ మానవ బాంబులు
మన మధ్యే మసలుతున్న
మింటనుండ భగవానుడు
కంట చూడడిటువైపు
తనకూ దుర్మార్గులన్న
తగన్ని భయం కాబోలు
మారణ మానవ బాంబన్న
మదిలో భయం కాబోలు
పశుత్వమీ రీతిగ
ప్రబలిన తరుణాన
మానవతా విలువల
మనుగడ నశించగా
దేవుడే దిగి వచ్చినా
ఆగునా ఈ ఘోరకలి
మషిని తిరిగి యధావిధి
మహితాత్ముడు తానగునా?

# 28. అసలైన అందాలు

కురులకు అందం
ఆ విరులూ కాదు
అల్లిన జడలూ కాదు
కొప్పులూ బిచోడాలు కానే కావు
కురులనభిమానించి ఆనందించే భర్తని
ఆ సిగ పాయలలో బందీ చేసి
ఆపానశాలలో తూలచేసి
వానిచే
లోకోపయుక్త పనులు చేయించడం!

ముఖానికందం
స్నోలూ కావు, పౌడర్లూ కావు
క్రీంలు, షేవింగ్‌లు కానే కావు
అందమైన ముఖం వెనుక నున్న
మెదడును ఆలోచనల్తో మధించి
తనకే కాక అన్యులకూ మంచేయగు నట్టు చూడడం!

కళ్ళకు అందం
ఆ కాటుకా కాదు
బ్రోలిడ్‌లను
బ్యూటి ఫయింగ్ చేయడం కానేకావు
కరుణా కటాక్ష వీక్షణలతో
నలుగురి బ్రతుకులనూ ఆనంద మయం చేయడం!

ముక్కుకు అందం
ముక్కెర కాదు
అలంకరించుకొనే అవేవీ కానే కావు
చుట్టూ వున్న సువాసనల నాఘ్రాణించి
ఇతరుల బ్రతుకులను సుగంధ మయం చేయడం!

చెవులకు అందం
చెవి పోగులూ కాదు
చెంప స్వరాలు కానే కావు
చెడు వినసే వినకుండడం
మంచి నందరికీ సదా పంచిపెట్టడం!

నోటికి అందం
ముత్యాల పలువరుసా కాదు
పెదాల మీది స్టిక్ రంగు కానేకాదు
చెడు మాటాడకుండడం
మాటలలో ఈ బెలు దొర్లకుండా చూసుకోడం!

వక్షానికి అలంకారం
ఆ కంటెలూ కాదు
కాసుల పేర్లు కానే కాదు
అందున్న ఆ గుండె
అందరి బాధలకూ స్పందించడం
అందరి జీవితాల్లో వెలుగు నింపడం!

చేతులకందం
గాజులూ కాదు
గడియారం నేల్ పాలిష్‌లుకానేకాదు
అవిచేసే అందమైన పనులు
ఇతరులను తట్టి వారి బాధలు పంచుకోడం!
కాళ్ళకు అందం
పావడాలు కాదు
మట్టెలూ హారాలు అంతకన్నాకాదు
వాటితో ముమ్ముందుకు సాగడం,
అందరినీ ఆత్మీయంగా ముమ్ముందుకు సాగించడం!

అలంకారాలు కాదు అందం
అవి తెచ్చే ఆనందం
కృతకం తాత్కాలికం
అవయవాల సార్థకతే అసలందం
ఆ అందం యిచ్చే ఆనందం
అదే అసలైన అందం

(చిన్నప్పుడు విన్న ఓ జానపదగేయం స్ఫూర్తి)

# 29. నీపై మసలుకో

నీవెక్కడ వసించినా — నీపై మసలుకో
నీపై పడి చస్తారంతా

నీపై విరుచుకుపడ్డా — నీపై మసలుకో
నీ ఓర్మిని కోల్పోకు

నిన్నంతా నిరసించినా — నీపై మసలుకో
నీ ధైర్యం విడువకు

నిన్నంతా ప్రేమించాలంటే — నీపై మసలుకో
నీ ఆత్మసాక్షి వదలకు

నీకెంత కీర్తి లభించినా — నీపై మసలుకో
నీ నైజమె చూస్తారంతా

నీకది అనవసరమైనా — నీపై మసలుకో
నీకేమీ లేదా ఫురదదు

నీ నష్టాలందుకూడ — నీపై మసలుకో
నీవే పొందెదవు ముందు ముందు

నీ ఆశలు అడుగంటినా — నీపై మసలుకో
నీ సమరమారంభించు మళ్ళీ

నీ సుఖశాంతులందు — నీపై మసలుకో
నీవో రాజుగా మనగలవు

నీ మది రొద గాండ్రిస్తున్నా — నీపై మసలుకో
నీవే జగమేలుతావు

నీవే చూస్తావొకనాడు — నీపై మసలుకో
నీ అదృష్టాన్ని నిర్దేశిస్తావు

నీకే లేదా తెలుస్తుంది — నీపై మసలుకో
నీ ఆత్మగౌరవం నిలుస్తుంది

(12 సం॥ల చిరంజీవి రాధానారాయణ్, ఇండియన్ ఎంబసి స్కూల్.
రియాద్, సౌది అరేబియా
సింపుల్ పెడ్వైస్ పోర్టు పోలోంకు 4-11-86 (హిందూ)లో

# 30. దివ్యకాంతులు

చోటిమ్ము నాకింత
నీ పాదముల చెంత
బ్రదుకంత పడియుందు
నీ చరణముల ముందు
చూపులోన ఓంకారము
హృదిలోన నీ రూపము
చివరంట నా వెంట
వచ్చు నివియేనంట
నీ స్మృతుల దివ్వెలవి
నా హృదిని వెలిగినవి
నా చిన్ని గేహమున
ఈ కొన్ని వెలుగులే
ఈశ్వరానుగ్రహాలు
ఈప్సితార్థాలూను!

# 31. క్రొత్త రీతి

ప్రేమ రీతులందు మనం
క్రొత్త ఒరవడిసృష్టిద్దాం
శత్రువుకైనా దగ్గరై
చక్కగ కౌగిట చేరుద్దాం!

# 32. బుద్ధి

అన్నీ మన
అశక్తతలు
మనబుద్ధికి
మారో బిడ్డలు

## 33. మానవాళిసేవే గొప్ప ష

ప్రతి మనిషి తప్పక
ఘనకార్యాలు సాధించాలని
కదా సృష్టి చేసినది
కాని దాన్ని ప్రక్కనపెట్టి
ప్రతిక్షణమూ భగవంతుని
ప్రార్థించుటలో వెచ్చబెట్టి
మేలు కలుగుననుకొంటే
మిగులు దుఃఖమే వారికి!

## 34. జిద్దు

కనులన్నవి మనసేనను
కల్మషింప దేసెనని
మనసన్నది కనులేపో
ననుముంచి వేసెనని!
రెంటిదొంగ జగడాలవి
యెవరికేమి కాలేదు
ఇద్దరి ఈజిద్దులోన
దిట్టనైన నేనే మట్టికరచినాను!

## 35. పని - బాధ

పనినెప్పుడు బాధతో
మార్చి మార్చి చేసుకో
ఎంతగ నీవానందం
పొందెదవో చూసుకో!

## 36. మారని మంచి

మంచిని సమాధి చేయడం
కలియుగ ధర్మమయితే
సమాధి తరువాతనైనా
మంచినే చేస్తుండడం
మంచికి తెలిసిన ధర్మం
బ్రదికినన్నినాళ్ళూ
నన్నేం చేయలేకనే
నా మంచి శత్రువులు
తామంత ఒక్కటిగ
నా చావు కోసమని
నానా యాతనలు పడిరి
చచ్చినాక కూడా విడువక
చెడు మీద నేను రెచ్చి
నను మోయు చెడువారి
నాల్గు భుజముల మీద
నటరాజునైన నేను
నర్తించి చూపాను॥

## 37. నీకు నీవే గతి

బ్రదుకు రహస్యం ప్రేమలో పొందితిని
అందరి బాధలు నావిగా చేసుకుని
కన్నీటి నా గాధ వినువారు లేనపుడు
అద్దము ముందుండి నేనే వింటినన్నిటిని॥

# 38. గెలుపు

ఓడానని నీవనుకుంటే
ఓడిపోయినట్లేనంట
నేనోడ్డడమేమనుకుంటే
నీకు ఓటమే లేదంట!
సంకల్పమె విజయానికి
సదా అగు పునాది రాయి
మస్తిష్క స్థితిలోనే కదా
మన్నుతాయి అన్నీను
అధిగమింతుననుకొంటే
ఆపలేదు నిన్నెవడూ
నీపై ఉండాలీ నీకు నమ్మకం
ఆకసమవ్వాలీ నీ ఆదర్శం
గెలుస్తాననుకున్నవాడే
గెలిచి తీరుతాడెపుడు!

# 39. అంతర్జాతీయం

అనురాగం
అందమైన
ఒక్క రోగం
బాధ భరించ
లేకున్నా
గుర్తుత్తాతు
వైద్యం!

# 40. పగ - ప్రేమ

ఒక చెంపపై కొట్టి వే
రొక చెంప చూపెట్టు
మరీ చెప్పె గాంధీజి
మన పూజ్య బాపూజీ!

బద్ధ శత్రువు దొడ్డ
పగను ప్రేమతో గెల్చు
బుద్ధిమంతుడు తాను
భువియందు పైకొచ్చు!

శరణు కోరినవాడు
శత్రువే తానైన
కరుణ చూపనివాడు
కడుహీన మానవుడు!

ఇతరులకు నీవిచ్చు
దయయు దాక్షిణ్యాలు
నగుమోముతో నీవు
తగ యివ్వలేనపుడు
అందులో సగమైన
ఆపినట్లే యగును!

నిండయిన మనసుతో
నీవుచేసే పనులు
మెండుగా మనకీర్తి
మెప్పులందిస్తాయి!



# 41. మసక మనసు

మనసు మూసుకు పోయినప్పుడు
మనకితరుల మాటలసలే నచ్చవు
వారివి మంచి పనులయినను చూడు
భూరి దోషములై తోచక తప్పవు॥
ఇతరుల మాటలు విని మనం
కుతర్కం పాలయి బుద్ధి కుళ్ళయి
మది తలుపులు మూసుకొందుము
చతురత సంస్కారం వివేకం కోల్పోయి॥

# 42. పదవి పొగరు

పనవి పొగరు తనకు
తలకెక్కె కాబోలు
నీ నమస్కారమునకు
ఈయడాతడు బదులు
గర్వమునంటి పెట్టుకుని
పతనము తావెళుతుందని
ఎంత చక్కగా చెప్పెను
ఇంగిలీషు మానవుడు॥



# 43. యాదేశుడు

చిన్ననాటి నుండి గుట్టకొచ్చితిమి
ఎన్నిమార్లని నిన్ను దరిశించితిమి
మా ఇలవేలుపుగా కొలిచితిమి
యాదగిరి లక్ష్మినృసింహ స్వామి!
నీ కరుణా కటాక్ష వీక్షణలు
మా పాలిటనవి మహా వరాలు
యేమని కీర్తించగలను నేను
నీ ఘనా ఘన మహాత్మ్యాలు!

(ఈ మధ్యోసారి రైలులో వరంగల్ పోతున్నప్పుడు యాదగిరి గుట్ట దర్శన సమయాన వ్రాసినది).

# 44. తల్లి ఒడి

ఒక తప్పు
జీవితాన
సుఖమెల్ల
తుడిచిపెట్టె!

ఒక తన్వి
సంతసాల
చితిచేర్చి
నిప్పుపెట్టె!

ఒక తల్లి
ఒడిని నిల్పి
సుఖ శాంతి
తెచ్చిపెట్టె!

# 45. కాపాడండి

కాలంతో పాటు సర్వత్ర
కరిగి పోతున్నది చరిత్ర
శాసనాలన్ని తుదకు
చట్టుబండలౌతున్నవి
చరిత్మాత్మక కట్టడాలు
మరియు మేటి శిల్పాలు
కుప్పకూలుతున్నాయి
కసుమరుగై పోతున్నాయి !
విద్రోహుల చూపుల్లో
విలవిలలాడుతున్నవి
బలవంతుల చేతుల్లో
భస్మమైపోతున్నవి
మన వాళ్లే కొల్లగొట్టి
మన శిల్పాలమ్మ బెట్టి
వ్యాపారం చేస్తున్నారు
జాతిద్రోహులౌతున్నారు
విలువైన శిల్పసంపదను
విదేశాలకు తరలిస్తున్నారు
ఇలాంటి విద్రోహులను
ఎలాగైనా పట్టివదేసి
కాళ్ళు చేతులు నరకడమే
కావలసిన కర్తవ్యం!

(శ్రీ వేంపల్లి గంగాధర్‌గారి 25-8-96 ఆదివారం ఆంధ్రజ్యోతి అనుబంధం లోని "చరిత్రను కాపాడండి" కవర్‌స్టోరీ ఆధారంగా స్ఫూర్తి పొందిన వ్రాసినది)

# 46. భారత్

పౌరులు దేశాన్ని
ప్రభుత్వాన్ని ప్రేమిస్తే
అది జపాను!
దేశాన్ని కాక
ప్రభుత్వాన్నే ప్రేమిస్తే
అది అమెరికా!
ప్రభుత్వాన్ని కాక
దేశాన్నే ప్రేమిస్తే
అది రష్యా!
దేశాన్ని ప్రభుత్వాన్ని
దేన్నీ ప్రేమించకుంటే?

# 47. తప్పు - నిప్పు

వేళ్ళు కాలినందుకు
నిందింతు వేల నిప్పును
ముట్టుకుంటె కాల్చడం
ముందే దాని నైజం
చింతించు నీ అజాగ్రత్తకు
చేయకెపుడూ ఏ తప్పు!

# 48. బుద్ధి బలం

మనుషులంతా
సమంగానే పుడతారు
బుద్ధి బలం
వాడుకునే చతురులు
ఇతరులనెపుడూ
అధిగమిస్తుంటారు
ధనకీర్తి శిఖరాలకు
దాపుల్లో మసలుతారు
వారిని ఇతరులు
ఎంతో వింతగ
నోరు తెఱచి
చూస్తుంటారు!



# 49. అదృష్టం

ఇద్దరు నాయకులు
పోటీకి దిగితే
బ్రతికి పోయాం
ఎవరో ఒక్కరే గెలుస్తారు
ఇద్దరూ గెలిస్తే
ఇంతే మన సంగతులు:-

## 50. తిక్కమనసు

కుక్క తోకకు
గుండు కట్టిన
కుదురుగా
అది నిలుచునా?
తిక్క మనసును
దిద్దు యత్నము
స్థిరపు బుద్ధికి
ఫలితమగునా?

## 51. త్రిశరణాలు

కరుణ లేక ప్రేమలేక
మానవాళి సేవలేక
బ్రదికే బ్రదుకు కన్న
చావది నిజంగా మిన్న
చావంటే భయమైతే
పైవేలే త్రిశరణాలు!



# 52. దేవుని వైపు

దేవుని వైపు మానవుడు
పదడుగులు తానేస్తే
మానవుని వైపు దేవుడు
ఒకడుగు తనేస్తాడు
మొదటి అడుగు తానే
వేయ వలయు మానవుడు!

---

# 53. నరక నిర్మాతలు

కొందరను మానాల
పెనుభూతాలై
ఎందరినో
పట్టి పీడిస్తారు!

కొంద రసూయల
కాలవాలమై
కుమిలి కుమిలి
తామే చస్తారు!

కొందరపోహల
కుళ్ళు బుద్ధులై
ఇతరుల బ్రదుకులు
గతుకులు చేస్తారు!

కొందరీర్ష్యా
భర శీర్షులై
ఎదుటివారిపై
ఏడ్చి ఏడ్చి చస్తారు!

కొందరు తాము
భయ విహ్వలులై
తమ బ్రదుకునే
తప్పుదారి పట్టిస్తారు

కొందరు దుర్వాస
క్రోధమూర్తులై
ఇతరుల కొంపల
కింత నిప్పంటిస్తారు!

పై అవగుణాలారు
ప్రబలంగా వున్నవారు
తమ సహజీవుల బ్రదుకుల
తప్పక నరకం చేయువారు!



# 54. తల్లి ఒడిలో తరించడం

చిన్ననాడు కలలు నేను
ఎన్నెన్నో కనే వాడను
అన్నీ నిజమయి నన్నవి
ఆశ్చర్యంలో ముంచె త్తెను।

యౌవనాన మామూలే
జవ్వనికై కను కలలే
కన్న కలల వమ్ముచేసె
ఉన్నత విద్యాభ్యాసాలే।

ఆపై విరబూసిన కలలు
అయినవి నలిగిన పూలు
భరించనలవి కానంతగ
బాధామయం బ్రదుకు లీలలు।

చివరి ఘడియ జీవితాన
చిత్రంగా అడుగిడె కవిత్వాన
సర్వకాంతులూ లభించె
సరస్వతీ సాక్షాత్కారాన।

ఇంతకన్న ధన్యత
ఏమున్నది బ్రతుకుకు
తల్లి సరస్వతి ఒడిలో
తరించడం చివరకు।

# 55. భయోత్పాతం

బాంబు పోట పెట్టారన్న వార్త
సృష్టించె భయోత్పాతం
చుట్టుపక్కల జనమంతా—
ఇట్టే ప్రాణాలకు పరుగెత్తిరి
బాంబేదీ లేదని తెలాక
నిశ్చింతగా నిట్టూర్చారంతా—
పని, పైసా, తేనెలకన్నా
ప్రాణమే సుమా మనకు మిన్న
అన్ని విడిచి పెట్టి మనం
అమాంతం పరుగెడుతాం
కాని చివరకు అయ్యేదేమిటి
ప్రాణ మనకు చేసేదేమిటి
ప్రాణి జ్యోతి ఆరిపోయి
పరమాత్మలో కలవాలని
శరీరాన్ని నిప్పుకొదిలి
చక్కగా తాను తప్పుకొంటుంది!

(ఆంగ్ల మూలం: కళాప్రపూర్ణ పోతుకూచి సాంబశివరావు)

# 56. దౌష్ట్యాంతం

తొమ్మిది రోజులు పూజలందు
దుర్గా మహామాత తాను
అందరినీ అనవరతం రక్షించు
అమ్మలందరి అమ్మ తాను !

అమ్మనే ఆదర్శంగ
అంతయే రౌద్రంగ
అంతం చేద్దాం దౌష్ట్యాన్ని
ఆమె సంతు మనమవటాన్ని !

దుష్టత దునుమాడుటకే
బ్రదుక వలెను మెండుగ
జయకేతన స్ఫూర్తియే
విజయ దశమి పండుగ !

అమ్మ తెచ్చిన సరదా
మనందరికీ దసరాగా
మనమూ ఇద్దాం సరదా
మంచికి మరో పేరుగా !

దసరా 21-10-96

# 57. అమోఘ్ం

కరుణ, ధర్మం
నీతీ, న్యాయం
కావాలి నీ జీవిత
గమ్యానికి ధ్యేయం !

యుగాలకు యుగాలె
ఉదయభానుని ఓలె
నీవు సదా ఎదగాలి
నీవలాగె వెలగాలి !

జీవించరా ఎల్లకాలాలు
దీవించునిదొ తాత అక్షరాలు
నీతినెవరు న్యాయాలూపిరై
జాతి రత్నమై నీవు వర్ధిల్లు !

అనంతాల వత్సరాలు
అమోఘ్ నీవు జీవించాలి
వేనవేలుగా ఈ సుదినాలు
విధిగా వస్తుండాలి !

నీవు చదివి గొప్ప చదువులు
ఎంతో పైకి రావాలి
నీవు చేయు మంచి పనులు
చిన్నా, పెద్దా మెచ్చాలి !

(చిన్ని మనుమడు అమోఘ్ పుట్టినరోజు ఆశీస్సులు 10-10-96)

## 58. మర్యాదా భూషణం

నా వలననె మర్యాద
జీవులకనె నైశ్వర్యం
నా వల్లే ప్రతిష్ఠకద
అని నుడివెను సామర్ధ్యం!

మంచితనమె సదా తెచ్చు
మనిషికి ఘన గౌరవం
మంచితనాన్ని నేనే సదా!
మనిషి ప్రతిష్ఠ పెంచెదననె!

ఐశ్వర్యం సామర్ధ్యం మంచితనం
అచ్చముగా ముగ్గురిదీ మిడిసిపాటె
మర్యాదను మించినట్టిదేది
మహిని లేదు మానవునికి పెన్నిధి

మర్యాదే మానవులను
మహా ఎత్తులకు తీసికెళ్ళును
మిగతవి వాటంతటను
తగురీతిగ ఒనగూరును !

## 59. వింత నైజం

చలికాలం వజవజ వణుకని
ఎండకాలం ఉఫ్ వేడి మంటలని
వానాకాలం వళ్ళంతా తడిసెనని
నిందించకు, ప్రకృతి నీమంగా చేయు విధులు
తట్టుకో, రక్షక సువిధుల వాడుకొని
నేర్చుకో వాటంతటి విధి నిర్వహణని!

# 60. సవాల్

చీకటిలో వున్నప్పుడు
సవాలే జీవకాంతి
ఏకాంతుడనైనప్పుడు
సవాలే స్నేహశీలి
బ్రదుకు ఆశ వదిలినపుడు
సవాలే నా ఊపిరి
పైకెదిగే యత్నంలో
సవాలే నా నిచ్చెన
యువ మూర్తుల్లారా! మీరందరు
నిరసించిన వారందర్ని
సరసంగా ప్రేమించండీ
అదే మీకగునో సవాల్—
అజ్ఞానులందరినీ
విజ్ఞానుల చేయండి
అది కూడా మీకు సవాల్—
నిర్లక్ష్య లక్ష్యులకు
లక్ష్యం మీరు చూపండి
అదే అగును మీకు సవాల్—
సజీవంగా జీవితాన్ని
సమభావంతో జీవించండి
సజావైన సవాలదే
సదా మీకు అగునండి:

(ఎ.కె.జెర్మ్ ఆంగ్ల కవితకు స్పందించి చేసిన స్వేచ్ఛానువాదం)

## 61. సన్మతము

పరమతముల
నిరసించుట
పరమ ఘోర
నేరమగును
అన్నిటిలో
మంచినంత
ఆకళించి
ఆచరించు
ఆదర్శమే
సమ్మతము
సన్మతము!

---

## 62. డబ్బు

కాలాన్నెలా
సద్వినియోగం
చేస్తావన్నది,
డబ్బునెలా
వినియోగిస్తా
వన్న దాని కన్న
కడుంగడు మిన్న
ఎలాగంటావా
కాలమే
కదా డబ్బు మూర్తి!

# 63. జాడ్యాలు

అస్మదీయ తస్మదీయాలు
ఆఫీసుల్లో అమ్యామ్యాలు
ఇచ్చిపుచ్చుకొను ఈ లీలలు
ఈ పాలనా రెడ్ టేపిజాలు
ఉత్తర దక్షిణల సంస్కృతులు
ఊపిరాడనీయని కునీతులు
అక్కడఇక్కడఎక్కడఅనకుండా
అంతటా విస్తరించిన జాడ్యాలు
జనుల రక్తం పీల్చి త్రాగే
జలగలే అంతా గూడా
జాతిని నిర్వీర్యం చేసే
జంతు బుద్ధి ఛండాలులు
మోక్షముందా వీటి నుండి ఎప్పుడైన
జాగృతమయేనా జాతి ఏనాడైనా ?

---

# 64. గాడ్సేలు

దేశంలో స్వర్ణోత్సవాలు
ప్రజల కవి గద్దర్‌పై కాల్పులు
యాభై ఏళ్ళ ప్రజాస్వామ్యంలో
సాధించింది గాడ్సేలే గాడ్సేలు !

# 65. వ్యాపారం

కొంతమంది తలిదండ్రులు
పెంచరు తమ పిల్లలను
వారెపుడూ పిల్లలపై
పెట్టుబడిని పెడతారు
దాని ఫలం పొందుతారు
సుతుల మీద లాగి కట్నం
సుతలది వాడుకొని జీతం
కాదా ఇది కర్కశ వ్యాపారం
ఇంతకన్నా వుందా వేరే నేరం!



# 66. కారుచౌక

వ్యాపార పరిభాషలో
మాట కారుచౌక
ఏలనని అంటారా
వినుడు వినుడు ఎంచక్కా
అవసరానికన్న
అందుబాటు మిన్న!

## 67. ఆచరణ

నేర్వాలని వున్ననాడు
నేర్వగలడు ఎంతైనా
నేర్చుకొనుట సులువే
నేర్పుటయూ సులువే
నేర్చిన దాచరించటమే
నిజంగాఅతి కష్టం!

## 68. చిన్న వాటి కున్న బలం

చిన్న నీటి బిందువులే
చేరి అగును సముద్రం
చిన్న ఇసుక రేణువులే
చేరి అగును ఎడారి
చిన్ని ఎన్నో నాణెములే
చేరి అగును పెన్నిధులు
చిన్ని చిట్టి నవ్వులే
చేయు నింటినో స్వర్గం
చిన్ని తీపి పలుకులే
చేకూర్చు ఘన విజయం!



## 69. గలనులు, లేదులు, కాదులు

ఇలలో ఉన్న మనుషులు
గలనులు, లేదులు, కాదులు కనగా మువురే
గలనులు అన్నిట సఫలురు
బలముగ ప్రతిదానికడ్డు పడెదరు లేదుల్
తలపడరు కాదులనలే
కలరిక పనులేల చేయ కాదులు కృష్ణా!

## 70. విత్తుకో!

కార్యాన్ని విత్తుకో
అలవాటది మొలకెత్తును
అలవాటును విత్తుకో
అలవరచును లక్షణం
లక్షణాన్ని విత్తుకో
లభ్యమగును సౌభాగ్యం!



# 71. జిహ్వా వైరులు

పాపముప్పు నేడు పాపియై పోయెను
రక్తవత్తిడి పెంచు రాక్షసై తోచును
దుప్పు కాస్తనైన ఉండాలి కూరలం
దుప్పులేని తిండి చప్పిడై పోవును!

పంచదార కూడ ఇంచుమించుగ చేదు
పాపితానయె నతి మూత్ర వ్యాధి వలన
నూటికేబది మంది నోటికి దూరమై
పంచదార నేడు బహుళంగ శత్రువయె!

చింతపండు యొకటె కొంత మేలది చూడు
చింతలేదు దాన్ని కొంత తిన్న
ఎట్టి రోగమునది పుట్టనీయదు తాను
తిట్లు తప్పెను తనకు గిట్టె పులుసు మనకు!

# 72. ఆశ్చర్యం

బాధలను భక్షించి
కన్నీరు త్రాగితిని
దినరాత్రములు నేను
దీనముగ బ్రతికితిని
అనుభవించినదేది
వినిపించగా లేను
ఆశ్చర్యమే యింక
బ్రదికియే యుంటిని!

# 73. ఆదర్శులే ఆర్యులు

సమాజ మంటేనే
సమూహ మార్యులది
ఆర్య సమాజమననే
అవసరం లేనే లేనిది!

ఆనాడు భారతదేశం
అంతా ఆర్యుల మయం
రాను రాను దండయాత్రలతో
రాచరికపు టరాచకాలతో

అనార్యులంతా చుట్టుముట్టి
దేశమంతా భ్రష్టుపట్టి
ఐపోయె ననార్యుల మయం
అదే నేడు మనముందున్న నిజం!

ఇపుడు మళ్ళీ మొదలు బెట్టి
ఈ కుళ్ళును మట్టుబెట్టి
అందరినీ ఆర్యుల జేయ
అవసరంగా కావాలో జగజ్జెట్టి!

సమాజమందేనే ఐక్యతా చిహ్నం
చక్కనైన అర్యుల సమూహం
అవసరమా ఈ కుల మతాల
అగ్నిలో నింకా ఆజ్యం పోయడం!

తమ పని తమదేశం పెంపుకోసమని
తగు శ్రద్ధా భక్తులనాచరించు కార్యులు
జపనియులలా దేశం సమయం నాదరించు
దేశపౌరులే లుపుడూ ఆదర్శులూ ఆర్యులు!

# 74. స్వర్గం నరకమైన వేళ

ఆకురాలు కాలమైనా
ఆమనైనా ఒక్కటే
పూదోటను దహించిరిలే
బుద్ధిపూర్వకంగా మూర్ఖులు!

భువిపైన వెలసిన స్వర్గం
ఒకనాడు మన కాశ్మీరం
చూడతలవనంతగ నేడు
పాడు పడిన పూలవనం!

ప్రక్కవాడు కన్నెసెను
తిక్కవాదం సృష్టించెను
తీవ్రవాద పద్ధతిలో
తిలకాన్నే చెరపనెంచెను!

వాడిన చిగురించవచ్చు
మాడినదేం చిగురించు
మానవత్వం వదిలి ధూర్తులు
మంటిడు నట్టుల దోచు!

ఎపుడితరుల దహించువారు
ఏనాడో వారే కాలిపోతారు
చల్లని కలల నిలయాన్ని
వల్లకాడుగా మార్చువారు!

# 75. పని

ఉత్సాహంతో చేసే పని
తెచ్చునెన్నో ఫలితాలను
నీ పనిపై నీ ముద్రను
నిక్కచ్చిగ వేసుకో
నీ ఆదర్శాల నీడలను
నీ పనిలో చూసుకో
పని యన్నది లేకుంటే
ప్రపంచమే లేదు కదా?
పని వల్లే కదా మనం
ఘన వృద్ధిని సాధిస్తాం!

# 76. తిరిగి రానివి

ఆడిన మాట
పేడిన పిస్తోల్ తూట
జారిన సమయం
విడిచిన అవకాశం
తిరిగి రావు నేస్తం
ఎరిగి వుండ స్తమానం!



## 77. ఆగ్రహం

సరైన విషయంలో
సరైన వానిపైన
సరైన పద్ధతిలో
సరైన సమయాన
సరిపోయేంత మాత్రం
సరిపోయేంత సమయం
ఆగ్రహం చూపువాడు
అందరునూ మెచ్చువాడు!

## 78. తీసుకో

కడుంగడు చెడుగు నీకు
కలుగునని కాచుకో
అదృష్టపు అంచులనే
ఆశించి శ్రమించుకో
అందిన ఫలమేదైనా
ఆనందంగా తీసుకో !

## 79. మోసం

కొందరి నెల్లప్పుడు
మోసగించవచ్చు
అందరినీ కొన్నిసార్లు
ఆడించనూ వచ్చు
అందరినీ అన్నిసార్లు
ఆడించ చిక్కున్నచ్చు !

## 80. మిడిసి పాటు

అదృష్ట దేవత
కనికరించినప్పుడు
అనవసరం
మిడిసి పడడమెప్పుడూ
అలా చేసినచో
ఆమె తక్షణం
చేయగలదు నిన్ను
వంటరి తుంటరిని!

---

## 81. హతవిధి

దురదృష్టం చేతుల్లో
హతుడను కాలేదు నేను
బోరున కురిసే వర్షంలో
కాలి బూడిదే యిళ్ళను
కాంచగానె తెలిసె నాకు
కాదు నాది దురదృష్టమని!

# 82. దేశఖ్యాతి

మనమంతా మానవులం
మన మతం మానవత్వం
మన నీతి మేటి సహనం
మన దృష్టి సమానత్వం
మన జాతి భరతజాతి
మన ఖ్యాతి సమున్నతం!

---

# 83. సద్వినియోగం

గతించిన కాలం
తిరిగి రాదు సుతరాం
వచ్చేకాలంపై
ఏమి మనకు నమ్మకం
గడిచే కాలమే
కలదు మన అధీనం
గడన చేసునేందుకు
వీలగునట్టి కాలం
అందుచేత అందరం
చేద్దాము సద్వినియోగం!

# 84. ఆడవారి మనస్సు

ఆడవారి నర్థం
చేసుకోలేని వారు
ఇద్దరే యిద్దరు
ఈ జగతిలోన
ఒకరేమో
బ్రహ్మచారి
ఒకరేమో
పతిదేవుడు !

# 85. కలికాలం

చెడ్డ వాణ్ణి ఎవ్వరు
బాగుచేయ యత్నించరు
మంచి వాణ్ణి చెడ్డగా
మార్చువారె అందరు !

కలికాలానికి
తగినట్టుగ
కనబడుతున్నదిది
భలే క్షేమగ్గ !

కావా మరి
తలక్రిందులు
పోకడలివి
అసహ్యంగ !

# 86. మనమొక్కటే

దుఃఖమే లేని వాడు
దొరకునా ఒకడైన
సుఖ దుఃఖాలనునవి
చుట్టివేయు నందరిని!

దుఃఖానికి కృంగితివా
మన ప్రేమ మాటేమగు
సుఖమైన దుఃఖమైనా
చెరి సగమూ పంచుకొందాం!

నన్ను నమ్మి చూడుమా
కన్ను కన్ను కలుపుమా
రెండు దేహములివైనా
గుండె ఒక్కటే సుమా

నీ ప్రేమ పై ఆన
నీ బాధ నా బాధ
ఇంత ఉదాసీనమొద్దు
సుంత మనసు విప్పి చెప్పు
నాతోనే దాచి నీవు
ఎవరితోని చెప్పుతావు
అన్యుడినీ కాను నేను
ఆ శివపార్వతులలా మనం
అర్ధనారీశ్వరులం
అని నిన్నెలా నమ్మించడం!

## 87. ఆరాధనా భావం

ఏ రూపములోనైనను
ఏ తొడుగుల యందైనను
ఏ వేళల యందైనను
ఏ అలంకారాలు లేకున్నను
ఏ చోటున ఏ మూటున
చూడగానే నీవు నాకు
చక్కావుగా తోచెదవు!

---

## 88. అనురాగం

నీ పేరును పలికారని
నాల్కలెన్ని నరకాలి
నీ రూపం చూశారని
కన్నులెన్ని పెరకాలి
నీ పేరును పలకాలి
నేనే నేనొక్కడినే
నీ రూపం చూడాలి
నేనే నేనొక్కడినే
ఇంతటి పిచ్చి ప్రేమికుడు
ఇంకొకడెవడుండబోడు
సరేయని పలికి నీవు
ఈ నా విధ్వంసం ఆపజూడు!

## 89 ప్రేమ వాహనము

మిట్ట మధ్యాహ్నాల
నీరెండ మిలమిలల
నీ ఒంటి నిగనిగలు
అలల వలె కదలికలు
తిప్పకుండా ముఖము
రెప్ప వాల్చక చూతు!
సాయంత్ర సమయాల
విరబూయు పుష్పాలు
విరజిమ్ము వాసనలు
నీ మేన అల్లుకొన
నిండు ఆరాధనతో
నేను ఆఘ్రాణింతు!
ఈ విధిని ఇద్దరము
చేతిలో చెయి వేసి
చెట్ట పట్టాలతో
నవ్వుతూ ఉండాలి
మన ప్రేమ పరస్పరము
కొనసాగు తుండాలి
మన ప్రేమ వాహనము
అలుపెరుగకుండాలి
ఆగకుండా ఎపుడు
అనుక్షణము నడవాలి!

# 90. చీకటులు

కనులలో పూర్వపు
కాంతియే లేదాయె
గళములో ముందటి
గాత్రమే లేదాయె
మారితి వదేలనే
కారణము లేకయే
మనసు పొరలవి చూడ
మాడినట్లనిపించె
మనమెపుడో ఒకసారి
మరి విడక తప్పదు
తల వ్రాత తప్పించ
గల వారలము కాము
అటువంటి వేళల
నేనేకాంత ముందు
ఆర్తితో బాధపడి
అలమటిస్తానునా
ఆ పరమాత్మ ని
న్నంత దూరము చేసి
బ్రదుకంత నా మీద
పగ తీర్చుకొన్నాడు
అతదేమొ సుఖముగా
ఆ పైన తానుండి
ఆనంద పరవశత
అనుభవిస్తూ వుండి.

# 91. ఆవేశం

ఆవేశం పూనినపుడు
చేసిన నీ ఆలోచన
శత్రువుగా ఎదుటివాణ్ణి
సాక్షాత్కరింప జేయు!
ఆవేశం తగ్గినాంక
చేసితివా ఆలోచన
నీకు నీవె శత్రువుగా
నిలిచిపోదువెపుడైన!
ఆవేశ కావేషాలు
అనలెందుకు పనికిరావు
శాంతం సౌభ్రాత్రాలు
సాధించు నద్భుతాలు!



# 92. మారినా వెందుకు?!

ఋతువువు నీవు కావు
అదృష్టమంత కన్న కావు
తేదీవి నీవు కానే కావు
నెలవూ, సంవత్సరం కావు
అట్టితరి నేనెలా
అనుకోగలను బాంధవీ
నీవిలా మారుతావనీ
నవ్విలా హింసిస్తావనీ!

# 93. కన్నె తలపులు

నిలువు టద్దం ముందు నిలబడి
తదేకంగా తనలో తానే
చూచుచుండె నదేమొ గాని
ఎంతసేపూ ముఖం త్రిప్పదు.

సర్వదా చంచలములౌ కనులు
ఇపుడు మాత్రం నిశ్చలమ్ములు
ఎంత చూచిన తనివి తీరని
అందమా ముఖారవిందము.

ఆమె మోమున తళుకు బెళుకులు
ముగ్ధమోహనమైన నవ్వులు
ఆమె తలపుల తన్మయత్వం
ఆమె పొందెనుపో తాదాత్మ్యం.

గాలి పొరలలో క్రొత్త పాటలు
పూల తావుల క్రొత్త భావం
చంద్రకాంతుల నూత్న చందం
సృష్టియంతా క్రొత్త అందం.

తళుకుమనె యెదలోన మెఱుపు
మబ్బు చాటున తారకల వలె
తానెఱుంగని భావమేదో
తనకు దుఃఖము తెచ్చి పెట్టెను.

అంతలోనే చిన్నబోయెను
వాడిపోయె ముఖారవిందం
ఆమె మదిలో బాధయేమిటో
ఆమె వైఖరి యేల మారెను.

కవియుగాని రవియుగాని
ఆమె వేదన యెరుగ లేదు
ఆమె చెంతన చేరి ఆమెను
ప్రేమ మీరగ చేర్చి అక్కున
బుజ్జగించాలీ
అనునయించాలీ
ఊరడించాలీ
కరుణ చూపాలీ!

## 94. ఇతరుల కన్నీరు

నీ బాధలేగా
నీ కెప్పుడు
ఇతరుల కన్నీరు
నీ వెరుగవు
ఇతరుల కష్టాలు
నీ వడుగవు
జగమందు ఎందరో
జనులు ఎల్లప్పుడు
ఏకాంతరాత్రులం
దెక్కెక్కి ఏడ్చెదరు
బాధల విషమును
మనసార త్రాగెదరు
కన్నీరె వారికి
కైలాసము
ఓటమియె వారికి
ఓంకారము
కాయమవ్వారికి
గాయమే గాయము!

# 95. తొందరొద్దు

మనసులు
చూపులు
మాటలు
కలవనే లేదు
నీ ప్రేమ శరములు
నా గుండెలో దిగెను !
తొందర పడకుండ
సుందరముగా చూడు
మనసుల బంధాలు
మట్టి బొమ్మలు కావు
చేసినప్పుడు చేసి
అపైన త్రుంచుటకు !
మనసుతో చూపుతో
మాటాడుకుందాము
మనమేమొ బ్రదుకేమొ
అది తెలుసుకుందాము !
ముసి ముసి నవ్వులలో
మురిసి పోదాం మనము
ముచ్చటగ తనువులను
ముడి వేసుకుందాము !

## ఎంత తేడా?

కొందరెచటి కెళ్ళినా
అందరికానందం కల్గుతుంది
ఇంకొందరు రాగానే
ఎపుడెళ్తారని పిస్తుంది !

# 96. వద్దంటివా ?!

వద్దంటివా నీవు
మాట్లాడను
లోలోననే కుమిలి
రోదింతును !

వద్దంటివా నీవు
నిను కోరను
పిచ్చోడినై వీధి
పాలౌదును !

వద్దంటివా నేను
నీ దరికి రాను
నాకు నేనే శిక్ష
నమలు చేస్తాను !

నీ జ్ఞాపకాలెపుడు
బాధించి చంపునను
ఏమి చేయను నేను
ఎచటకని పోతును
నాకు నేనే రీతి
నచ్చ చెప్పెన్ను !

## కంప్యూటర్

కంప్యూటర్ అభిలాష
కొంప "తెలుగు"ది ముంచునా ?
ఆంధ్రాలో తెలుగు భాష
అంతరించి పోవునా?



# 97. వెళ్ళే దెటకు

ఎన్ని పంచలకు
శాంతి కోసమని
వెళ్ళి యుంటినో
వివరించలేను ।

దేవుని సాక్షిగ
శాంతి మాత్రము
దొరకదాయెను
నాకెచ్చటను ।

ప్రేమకై బాహువులు
సాచని దెచ్చట
ప్రేమలో బహువులు
పడిపోనిదెచ్చట?

కన్నీరు చూసినా
కరగనప్పుడు నీవు
ఇతరుల ఆశ్రయం
ఏ రీతి లాభమగు ।

వేడితో అధరాలు
వీక్షించె కాన్తతడి
ఒక చుక్క తడి కూడ
చిక్కనే లేదాయె ।

లోకులేమిచ్చెదరు
చీకటినే కాదా
నా కనుల వెలుగులు
నా నుండి లాగియును ।



# 98. బంధం

ప్రేమలేఖ నీది
భామరో చదువగనె
నాలో భావావేశం
నవ చైతన్యంగ
నాలో వాస్నావేశం
నవ నవోన్మేషంగ
పొంగి పొరలి పోయెను
పొందు నవీ కోరెను!
ఉత్తరాలతో నేమగు
చిత్తములవి కలవాలి
చిత్రముల తరువాత
చేతులవీ కలవాలి!
బాహుబాహువులతో మేనులు
బంధించుకు పోవాలి
బహుబంధమున కన్నను
ప్రేమబంధ తీవ్రత
అధరబంధ మందు కూడ
అగును కదా పరవశత
ఈ ద్వయ బంధాలలో
ఈ అద్వైత స్థితిలో
రెండు ప్రేమ హృదయాలు
రెండు నిండు దేహాలు
ద్వైతంలో అద్వైతంలా
ఉండి పోవునేకంగా
ఊహాకందనందాక!

# 99. మోహావేశం

ఆలోచన
సాలోచన
అనకుండా
లక్ష్మణరేఖల
నన్నింటిని
లఘించితినీ
ఆచారం
గీ చారం
అన్నీ వదిలి.
అయినవాళ్ళు
కాదన్నా
కానివాళ్లు
వద్దన్నా
ప్రేమ గొప్పదని
మరోమారు
నిరూపించి
నీ ప్రక్కన
నిల్చితిని
మన మొక్కటె
ఐపోతిమి !

## గెలుపు

మాకు శక్తినిమ్ము దేవ
మా మనసుల గెల్చుటకు
ఇతరులన్నా గెల్చుముందు
మమ్ము మేము గెల్చుటకు !
(హమ్ కో మన్ కి శక్తి దేదో కు అనువాదం)

# 100. గుండెలో తుఫాను

సూర్య చంద్రుల కోట
చుక్కల తళ తళలు
పొందగలనని నేను
అందముగ ఆశించ
చీకటుల దొంతరలె
నాకు మిగిలెను తుదకు
దారులందరి వీను
వేరు వేరాయెను
తను బంధములు వీడె
కనుచూపు కరువాయె —
ఆశయాలాశలు
అల్లుకొంటే నేమి
అవియన్ని ఏకముగ
అడియాస లయెనేని
ప్రేమ కోరిన తరిని
పెను దుఃఖమే మిగిలె —
మనసు శాంతిని కోర
పెనుతుపాను లభించె
గుండెలో తుపాను
ఘోషలే ధ్వనియించె
ఇకపైన ఈ హృదికి
శాంతి లేదనిపించె
మది స్మశానపు మోడ

భయ భీతి తలపించె
కొట్టుకొని పోతున్న
గుండె తా విలపించే
గట్టుకా గరి కదా
అన్నట్టు లనిపించె
కధ ఎల్ల వెతయేను
బ్రదుకంత చేదేను
సతతమ్మ యింకేల
బ్రదుకన్న ఈ ఆశ !



## 101. తోడు - జోడు

నా తోడుగా నీవు
నడయాడు తానంటె
నా మధుర కవితలను
నీ మీద కురిపింతు
నను చూసి ముసి ముసిగ
నవ్వుతుంటా నంటె
నిను చూస్తు కవనాలు
వినిపిస్తు నేవుందు —
అందముల వెన్ని
సుందర ప్రకృతిలో
కనువిందు కలిగించు
మనసులను అలరించు -

కనులవి యేలనో
కాంచగానే నిన్ను
కదలలేమన్నవి
వదలలేమన్నవి -
కలలలో సతతము
కనిపించు దేవతవి
ఊహాలనెంతగా
ఉత్సాహ పరిచితిని -
నీ గమ్యమును నేనె
నీ వెరుగుదువో లేదా
అదృష్ట దేవతగ
ఆరాధనను సేతు
నీ వాడినని నేను
నీ వొప్పుకుంటివా
వాసంత సజ్జికలు
పరుతు మన కోసమని
ఒంటరిగ మార్గాల
వెంట నడిచితినెన్నొ
ఇకపైన నడువలే
నేకాకిగా నేను
అందమైన తోడు లేక
ముందుకింక పోలేను
నాకు తోడు నీవైతే
నీకు నేను సరిజోడు
నా అడుగులందుననే
నీ వడుగులేస్తుంటె
తారకల నన్నిటిని - నీ
దారులన్నింపుతా!

# 102. నేనే ప్రధానినైతే

నేనే ప్రధానినైతే
నెరవేరుస్తా పనులెన్నో
మంచి నీరు యిప్పిస్తా
మంచి కూడు యిప్పిస్తా
చిన్న గూడు యిప్పిస్తా
మందు లందఱికిప్పిస్తా
మంచి ఆరోగ్యం కూరుస్తా
పనిపాటలు చేయిస్తా
బాలబాలికలందరినీ
బడికి నేను పంపిస్తా
మంచి మంచి ఆహారాలు
సంచిలో కాస్త పుస్తకాలు
చక్కని యూనిఫారాలు
సవ్యంగా అంద చూస్తా

సంతోషంగా పాఠాల్చెప్పే
చక్కని గురువుల నియమిస్తా
అయినా పిల్లలు చదవకపోతే
అమ్మ నాన్నల దండిస్తా
ఉన్నవారి నుండి నేను
పన్నులు వసూలు చేస్తా
లేనివారి అవసరాలను
నేను తక్షణం తీరుస్తా
నేరస్థులనందరినీ
నిర్దయగా దండిస్తా
రక్షక భటులు జనాలను
రక్షించేట్టు పాలిస్తా
ఈ విధి దేశాన్నేలుతా
ఎల్లరి కానందం పంచుతా!

(రెండవ తరగతి బాబు అర్జున్ వెంకట్ " ఇఫ్ ఐ బికమ్ ప్రైం మినిస్టర్ ఆంగ్ల రచన ఆధారంగా) 14-11-95 హిందూ డైలీ)



# 103. పెద్దవాళ్ళు

ఎంత అదృష్టవంతులు
లేవు వారికి చదువులు
లేవు ఇంటి పనులు
లేవేవీ పరీక్షలు
లేవసలే తిట్లు
లేనే లేవు కొట్లు
లేవేవిధ భయాలు
లేవు వారికి కన్నీళ్ళు
వారెంత అదృష్టవంతులు —
నిజంగా నిజం పెద్దలు
తోచినవన్నీ చేయగలరు
మైకే లేకుండా మాట్లాడగలరు
పిల్లలను బెదిరిస్తారు
ఆజ్ఞలను గుప్పిస్తారు
పిల్లలకు పిచ్చి లేపుతారు
వారి ఒళ్ళు ఝల్లనిపిస్తారు
వారిని వ్యాకుల పరుస్తారు
అయినా వారిని ప్రేమిస్తాం
అప్పుడప్పుడూ వారిని మేం
అసహ్యించుకుంటుంటాం
ఆట పట్టిస్తుంటాం
అయినా అదేమిటో కాని
అనుకుంటాం పెద్దవాళ్ళవ్వాలని!

(పన్నెండేళ్ళ శశాంక్ నారాయణ్ బాబు సర్దార్ పటేలు విద్యాలయం న్యూఢిల్లీ మూలంగ: 14-11-95 హిందూ డైలీలో)

# 104. శాంతి పతాక

ప్రపంచాన శాంతి లేదు
తరంగాన శాంతి లేదు
గడ్డి పరకకు శాంతి లేదు
కంచు గంటకు శాంతి లేదు
మనకు శాంతి అవసరం
ఎంతని మనం చెప్పగలం
కావాలంటాం కొందరం
వద్దంటా మింకొందరం
ఏ ప్రపంచమో యిది
శాంతి లేనే లేనిది
శాంతి కొఱకై ఒక్క వేళ
సమరమే చేయాల్సొస్తే
సంతసంగా మొదలుపెట్టి
బలాన్నంతా కూడగట్టి
సాధించి దేన్నైనా కొల్లగొట్టి
చూపిస్తా శాంతి పతాకం నిలబెట్టి

(చి॥ దీక్షా సురేంద్ర, ఆరవ తరగతి, మానెక్జి కూపర్ స్కూల్
బొంబే, ఆంగ్లంలో వ్రాసిన 'పీస్' కు స్వేచ్ఛానుకరణ)
14-11-95 హిందు డైలీ

**చింతా సంతసాలు :**

సంతస దినాలు
ఎంతగ చిన్నవి
ఎంత దీర్ఘములు
చింతల రోజులవి !

## 105. కలసి వుంటే కలదు సుఖం

రెక్కలమ్ముకున్న వాళ్ళ
ఇక్కట్లే అవి వేరు
ఒక్కచోట ఉండు వాళ్ల
చక్కదనమె అది వేరు
రావడమూ పోవడము
రయముగ జరిగేవి కావు
మనమనుక్కున్నట్లుగ
మనసు కలిసేవిలు కావు
కలిసి మెలసి వుండాలను
కల అది చెదిరిందా
కన్నీరేమిగులును అన్ని
కల్పాలవి గోవిందా
ఏమి బ్రదుకులో యివి
యేమేమి బంధాలో
ఈ రాక పోకలివి
ఎంతగాను కష్టాలో
కలిసి వున్ననాడే కద
కలలవి పండేడి
విడివిడిగా వున్నామా
బాధాకరం బ్రదుకది.

### నమ్మవద్దు

కన్నదంతా కూడ
కడునిజం కాదు
విన్నదెల్లా నీవు
తిన్నగా నమ్మొద్దు!

## 106. గీతాచార్యుడు

ఎపుడూ ఏ పనీ నేను
ఏమాశించి చేయను
ఆచరణ ఫలిస్తే మటుకు
ఆనందం పొందుతాను!

ఇదేనా గీతాచార్యుడు
సంహితలో బోధించాడు
నిష్కామ కర్మ ధర్మమని
ఫలాపేక్ష పాపకర్మయని!

ఇపుడాచరిస్తున్న వాడిని
అపుడు ప్రబోధించినవాడిని
నేనేనా అనిపిస్తున్నది
నామధేయమూ కలుస్తున్నది!

## 107. నల్లూరికి

కవిత్వాల్లో భావాలు
గగన విహారం చేస్తున్నాయి
భూమిపై నున్న శ్రోతలు
అందుకోనంతగ ఎగురుతున్నాయి

ధరలే అనుకుంటే
ధరలకన్న అస్థిరంగ
ధరను విడిచి కవితా
ధారలూ ఎగుస్తున్నాయి

వాదమేదైనా సరే
వాణి యేదైనా సరే
నల్లూరికి అర్థమైందే
నాణ్యమైన కవిత అనరే!

# 108. పంచశీలుండు

పిల్లల కాదర్శుడు
పెరవారికి సహకారుడు
తప్పుకు క్షమకోరువాడు
ఆశకులోనవని వాడు
ఓమ్ ప్రథమమను వాడు
గెలుపు సహకారులదనువాడు
నగుతూ వెన్ను చరచువాడు
పిల్లలతో ప్రార్థన చేయువాడు
తన తప్పు నెరుగువాడు
తనదేదీ కాదనువాడు
ఏమాశించక ఇతరులతో
తన కలిమి పంచుకొనువాడు
అందరికీ కావల్సిన వాడు
అంతటా ఉండదగిన వాడు!

# 109. గుండె గుప్పెడు

గుప్పెడంత గుండెయైన
ధర్మమున్న అందున
అందముండు నడవడికన
అందమున్న నడవడికన
ఐకమత్య మింట ఎదుగు
ఇంట ఐకమత్యమున్న
సమ్మతి జాతిలో నెదుగు
జాతిలోన సమ్మతున్న
శాంతి క్రాంతి ప్రపంచాన
సంభవమై వెలుగులీన
విశ్వమందు సుఖావళి
వెల్లివిరియు వేముఖాల
విశ్వాత్ములై జనులు
విశ్వమానవులై తరింత్రు!

## హద్దులొద్దు

విశిష్ట అన్యోన్యతకై
విశ్వాన్ని తీర్చిదిద్దుదాం
దేశాల మధ్య హద్దుల్ని
దీటుగ తుడిచేద్దాం !

## మహాత్కార్యాలు

ఇతరుల ప్రభావాలకు
ఈషణ్మాత్రమైనా
లోనవనపుడే తాను
చేయును మనిషి మహత్కార్యాలు

## అనంతానంతాలు

అనంతం జీవితం
అన్నంగ తెలుసుకో
అంతం రేపే అని
అనుకొని మసులుకో !

## గుండె-నాల్క

అజ్ఞుని గుండె నాల్క నుండు
విజ్ఞుని నాల్క గుండె నుండు !

## ప్రపంచం

మనిషి ప్రపంచ మెంత?
వాని సహృదయమంత !

## మనీషి

మనీషికి
మగబుద్ధి
మగువ మనసూ
బాలల
మనస్తత్వం
ఉంటాయి !

## వినయం

వివేకానికి మెఱుగు
వినయంతో కలుగు !

## తలగడ

నిర్మలమగు మనస్సాక్షియే
నిద్రకు మాంచితలగడు !



# 110. శాంతి దూతా - వీడుకోలు

శాంతి దూతా రాష్ట్రధాతా గురుతనేతా
నగర తేజము నినుమడించిన మహాత సవితా
ఊపిరుల నీ సుగంధం ఊరువాడా విస్తరించె
అడుగు చప్పుడు రాష్ట్రమంతా అన్నిచోట్లూ ఆదరించె
మచ్చలేని మహిత ప్రేమకు మాన్యమైనది భాగ్యనగరం
అద్దమట్టి విశుద్ధ ప్రేమకు ఆలవాలం ఆంధ్రరాష్ట్రం
హసన్ముఖుడవు, కవిహృదుడవు, అందమైన మనస్కుడవు
శాంతి కాంతిని విస్తరించిన శాక్యమునికే నీవు బంటువు
మంచితనముకు మహితసేవకు మారుపేరువు
రంగు మార్దవ మందు నీవు రమ్యరోజా విగ్రహుడవు
చల్లదనపు దృష్టి నీది ఉల్లమంతా కరుణ కలది
మట్టిపై నీ దృష్టి పడెనా బంగరే అయితీరుతుంది
హృదయమందలి వెన్నెలంతా పెదవిపైనే తా హసిల్లు
పెదవి విప్పి మాటలాడితె ప్రేమమూర్తే తారసిల్లు
పూల తొడుగులు బహుకరిస్తివి ఎంతమందికి
వేల ఇతరులు వేచియుండిరి వారి బారికి
కాంతి క్రాంతీ కారకమ్మగు సదాలోచనె నీకు ఎప్పుడు
పనికి వచ్చెను గొప్పగానే అదే మాకు చిక్కులప్పుడు
దేశమందున ఎచటనున్నా తిరు మహాశయ నీవు
ఈ దక్కను పీఠభూమిని సదా గుర్తుంచుకుంటావు !

(గవర్నర్ శ్రీ కృష్ణ కాంత్ ఉపరాష్ట్రపతిగా వెళ్ళిన సందర్భంగా 19-8-97 ఉరుదూ కవి సలాహుద్దీన్ నయ్యర్ కవితకనువాదం)

# 111. భారతీ స్తోత్రము

లక్షలున్నా కోట్లు ఉన్నా
లక్ష్మి లాలనలోన ఉన్నా
భారతీ! చదువు లేదను
బాధ పడుదురు జనులు మెండుగ!

పీఠమిచ్చుట వెలయచేసి
ప్రేమ మీరగ ప్రతిష్ఠింతు
జనులు అంతా ఇచట నీకు
జయధ్వానాల్పలుక జూతు!

పీఠం కార్యక్రమాలను
పెద్దగ శుభప్రదం చెయ్
రాజధానిలో నీ పేరు
పూజలందునటు జూడు!

తల్లీ నిన్ను దలంచి పట్టిన కలం తానై తనే ఈ విధిన్
తల్లీ నంబయి వ్రాయుచుండె కదె తాదాత్మ్యమ్ముగన్ ఎప్పుడున్
తల్లీ ఏమని చెప్పనమ్మ ఒక సీధా సాద పుత్రుండనే
సల్లాపంబున నిట్లు నా కలముచే స్రావింపగా చేయవే!

కాలం

కాలం గొప్ప న్యాయ నిర్ణేత
కాలం కలిసొస్తే ఎవడైనా విజేత
అందరికి ఒకప్పుడు కాలం
అదే రీతి పంచు నాప్యాయత!

# 112. బాసర భారతి

1) నాకు గుర్తు చేయుటకే
నా తల్లీ వచ్చితివా
లేక నా వెంటుండుటకే
లీలనే తెంచితివా ?

2) ఏమైనా నాభాగ్యమే
ఏమని చెప్పమంటావు
తల్లి తరలి రావడమే
తక్కువనా ఏమంటావు ?

3) నీ పేరిట నెలకొల్పితి
నేను సరస్వతీ పీఠము
నా తల్లి బాసర భారతి
నా కసంత జ్ఞానమిమ్మ !

4) ఈ వారంలోనే నేను
నీవద్దికి వస్తున్నాను
ప్రప్రధమంగా నిను పూజించి
పని మొదలిడ నున్నాను

5) పీఠానికి కావలసిన
పెద్ద హంగులన్నిటిసీ
నీ కరుణే వుండెనేని
నేను కూర్చుకోగలను

6) సత్యవ్రతుణ్ణి నాకు మరో
సత్యాన్ని తోడిచ్చావు
నిత్యసత్యమై నీ పీఠం
నినందించును నీ వైభవం !

7) నీ దయతో పీఠాన్ని
నేనెంతో ఆదర్శంగ
మరెంతో సమర్ధంగ
మలచాలని నాకుంది

8) తల్లి బాసర భారతి
వెల్లి విరియు పీఠంలో
పీఠం ఎదిగే సంగతి
పెట్టితి నీ చేతులలో !

## సర్వనాశనం

మంచీ మమత మానవత్వం
మనిషిలో ఈ రీతి మృగ్యం
అవడాన్ని చూస్తుంటే
అగుననిపిస్తోంది సర్వనాశనం !

## కలియుగం

స్వార్థం ఇంతగా పెరగడం
అర్ధం లేకుండా ప్రవర్తించడం
తడి బట్టలతో గొంతు కోయడం
కలియుగ మహిమా ప్రభావం !

# 113. ఇదేరా సుదినం

పేరులో లేదురా
పెన్నిధి మనుమడా
పిలుస్తా చూడరా
డెన్నినవే మనుమడా !

అమ్మనాన్నల కీర్తి
నధిగమించాలిర
వారిద్దరే స్ఫూర్తి
కారులవ్వాలిర !

అన్నాను డెన్నినని
ఆగడం చేయకుర
అమోఘ్ బావని
ఆట పట్టించకుర

కన్నారు కలలెన్నొ
డెన్నీను నీ కొఱకు
నిజము చేయాలన్ని
నీపేర చివరకు !

కృష్ణుడు వాడైతే
అర్జునుడు నీవుర
మీరిద్దరాలీతే
మెరిసి తీరాలిర !

అందుకొను మీ తాత
అక్షరాశీస్సులు
ఆకాశమెత్తంత
అలరు నీ కీర్తులు !

అన్ని మీ పనులిక
అవిఘ్నమగు గాక
ఆకసమె మీకింక
హద్దు తానౌ గాక !

డెన్నీసను ఈ ఘనునికి
చిన్ని ముద్దుల మనుమనికి
బారసాల నాడీ చిన్ని
బహుమతి కవిగారిది.

(అల్లుడూ, కూతురు— క్రిష్ణా, స్వప్నల ముద్దుల తనయుడు "శౌర్య" బారసాల నాడు తాతయ్య అక్షరాశీస్సులు- బాబు సంధి నామము "డెన్ని", అమోఘ్ నా కొడుకు బాబు)

29-8-1997

తాదులు చక్రముల్లము శరాదికవర్గము వైజయంతి సో
త్పాదకభూతపఙ్క్తి యని వైకృతి విద్యయు నయ్యవిద్యయున్. 83

## భగవదవతారరహస్యకథనము.

వ. ఏతాదృగ్విధవిగ్రహవిశిష్టవేషంబునం బరవ్యూహవిభవార్చాంతర్యామిరూపంబులనం బరమపురుషునకుం బంచప్రకారంబులు గలవు. అందుఁ బరరూపంబు నిత్యముక్తానుభవార్థంబుగా నిత్యేచ్ఛానుగృహీతం బైననిత్యవిగ్రహంబునం బరమపదంబునం బరమవాసుదేవాభిధానంబున వెలుఁగొందుప్రధానప్రకారంబు. ఇట్టిది పరరూపంబు. జగదుత్పత్తిస్థితిప్రళయార్థంబు నుపాసకానుగ్రహార్థంబును సుక్తగుణద్వయద్వయాభివ్యక్తిలక్షణలక్షితంబు లై నిజేచ్ఛావశంబునం గైకొనినసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధవాసుదేవభావంబు లగుచతుర్విధవిభాగవిశేషంబులు వ్యూహంబు లనంబడు. అందుఁ గేశవాదిమూర్త్యంతరగ్రహణరూపంబు లైనయవాంతరవ్యూహంబులు వివిధంబులు. ఇట్టివ్యూహవిశేషంబులు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనార్థంబుగాఁ దిర్యఙ్మనుష్యవిజాతీయతాంగీకారంబునం జూపునావిర్భావంబు విభవం బనం బడు. అదియును గౌణంబును ముఖ్యంబు నన ద్వివిధంబు. అందుఁ గర్మవశ్యజీవాధిష్ఠానద్వారంబునం దాత్కాలికకార్యార్థంబుగాఁ జూపుగుణావిర్భావంబు గౌణంబు. మఱి దీపంబువలనఁ బ్రతిదీపంబురూపంబున దివ్యవిగ్రహంబుతోడన చూపునావిర్భావంబుముఖ్యంబు. అందును వామనత్రివిక్రమన్యాయంబుననవాంతరాకారాంతరగ్రహణంబు లసంఖ్యేయంబులు. ఇంక నంతర్యామి యన నుపాసనాసిద్ధికై యుపాసకాంతరంగంబులకు విషయం బయ్యెడునుపాస్యవిగ్రహవిశేషంబు. మఱి యర్చావతారం బనం బరవ్యూహాదిసమస్తప్రశస్తలక్షణపరిపూర్ణంబై దేశకాలస్వభావవిప్రకర్షంబులేక యనాలోచితవిశేషాశేషజగజ్జనోజ్జీవనార్థంబుగా మాంసనయనంబులకు ననుభావ్యం బైనపూర్వోక్తసమస్తప్రకారంబులం జూపునవతారవిశేషంబు. అదియు స్వయంవ్యక్తంబు దైవంబు సైద్ధంబు మానుషంబు ననంజతుర్విధం బై యుండు. అందు నప్రాకృతదివ్యవిగ్రహంబున స్వతఃప్రాదుర్భావంబు స్వయంవ్యక్తంబు. శిలాదారులోహాదివిగ్రహంబుల దేవజనంబులచేతం దపస్సిద్ధమహర్షిజనంబుచేతను మర్త్యజనంబుచేతను బ్రతిష్ఠితంబు లైనయవి క్రమంబున దైవంబు సైద్ధంబు మానుషంబు ననంబడుఁ. ఇట్టిపంచప్రకారంబులయందుం బరరూపంబు నిత్యైకప్రకారంబు, అది నిత్యముక్తైకగోచరంబు, వ్యూహరూపంబు వివిధంబు. తత్తద్దేవర్షిమాత్రగోచరంబు, విభవం బనంతప్రకారంబు, అది తత్తత్కాలీనజనగోచరంబు. అందును ముఖ్యవిభవంబు సైద్ధంబు నంతర్యామిరూపంబు నుపాసకేచ్ఛాభేదంబున నైకవిధం బుపాసకైకగోచరంబు. అర్చారూపం బనంతప్రకారంబు, అనాలోచితవిశేషాశేషజగజ్జనగోచరం బఖిలప్రకారసేవ్యంబు. 84

ఉ. దారుశిలాదిభావమున దైవముల న్నిరసించి తామసుల్
గోరుదు రెంత చేరుపయొకో తమ కాత్మవివేకపాకముల్
వారిధరంబుల న్విడిచి వచ్చినచాతకధూర్తు లంబుధిన్
దారు గొనంగ శక్తులె సుధామధురోదకపానసౌఖ్యముల్?. 85

క. కావున సర్వగుఁ డయ్యును, శ్రీవరుఁ డర్చాగతుండ సేవ్యుం డగుఁ ద
త్సేవయు శరణాగతుఁ డై, కావింపక ఫల మొసంగఁ గా లే దధిపా!. 86

## ప్రపన్నస్వరూపనిరూపణము

వ. దుర్లభాభిమతార్థసిద్ధికిం గృపాశక్తిసంపన్నుం డైనసమర్థునియందు నుపాయాంతర నివృత్తిపూర్వకంబు గాఁ జేయుభరసమర్పణంబు శరణాగతత్వం బనం బడు.ఇదియభి మతార్థసిద్ధిదం బగుట సకలజగత్ప్రసిద్ధంబు.ఇట్టికృపాశక్త్యాదిగుణవత్స్వరూపంబైన శరణ్యత్వంబునుం భగవద్వ్యతిరిక్తపురుషాంతరంబునం దౌపాధికంబు నల్పాల్పత మంబును నైయుండు. అతని నాశ్రయించువానిశరణాగతత్వంబు నౌపాధికంబు నల్పాల్పప్రయోజనంబు నగు. ఆశరణ్యత్వంబు భగవంతునందు స్వాభావికంబును నిరతిశయంబును నై యతనియందుం దదితరసమస్తపురుషులకు శరణాగతత్వంబు స్వరూపోచితంబును నిరతిశయప్రయోజనార్థంబు నగు. అట్లగుట నీయర్థంబున యథార్థజ్ఞానంబున నిశ్చితంబుగా నెఱింగినసాత్వికుం డభిమతార్థసిద్ధికి నితరుల నొల్లక భగవంతు శరణంబు సొచ్చి తదారాధనంబు సేయవలయు. అట్లు చేసె నేని స్వరూపసిద్ధియు దేశకాలమంత్రతంత్రాదిన్యూనాతిరేకంబులవలన వైకల్యంబు లేక యారాధనఫలాభిమతార్థసిద్ధియు నగు. అట్లు సేయం డేని కర్తృత్వాహంకృతిచే స్వరూపహానియు నారాధనవైకల్యంబుచే ఫలహానియు నగు. ఇట్టిసాత్వికుండును మిశ్రసత్వనిష్ఠుండును శుద్ధసత్వనిష్ఠుండును నన ద్విప్రకారుండు. అందు మిశ్రసత్వనిష్ఠుం డనం బరమాత్మ యగుభగవంతునకుం గలశేషిత్వంబునుం దదితరసమస్త జీవాత్మలకు నైనశేషత్వంబును స్వాభావికంబులుగా నెఱింగియుఁ దదేకభోగ్యుండు గాక ప్రారబ్ధకర్మవాసనావశంబునఁ దామసరాజసఫలంబు లభిలషించి తదర్థంబుగా భగవత్ప్రపత్తి సేయునతండు. శుద్ధసాత్వికుం డన సుజ్ఞానంబుచే భగవదేక భోగ్యుం డై తత్ప్రాప్తిరూపమోక్షంబె యపేక్షించి భగవత్ప్రపత్తి సేయున తండు. అందు మిశ్రసత్వనిష్ఠుండు నీశ్వరయథార్థజ్ఞానవంతుం డగుటం దత్ప్రభావం బుచేఁ గ్రమంబున ఫలానుభవంబుచేత నీశ్వరానుగ్రహంబుచేఁ బ్రారబ్ధకర్మంబు జయించి శుద్ధసాత్వికుం డగు. అట్టిశుద్ధసాత్వికుండును ననాదిసుకృతపరిపాకభేదం బున నంగప్రపత్తిపరుండును స్వతంత్రప్రపత్తిపరుండు నన ద్వివిధంబగు. అం దునంగప్రపత్తినిష్ఠుం డన నభిమతభగవత్ప్రాప్తికిఁ గర్మజ్ఞానానుగృహీతం బైనభ క్తియోగంబుచే భగవదనుగ్రహంబు వడయంగోరి తాదృగ్విధభక్తినిష్పత్తికై

త్రదంగంబుగాఁ శరణంబు చొచ్చునతండు. స్వతంత్రప్రపత్తినిష్ఠుండన నుక్తభక్తియోగనిష్పాదనంబునయం దశక్తుండును విలంబాసహిష్ణువు నై యవ్యవధానంబున భగవదనుగ్రహంబు వడయుటకై ప్రపత్తి సేయునతం డట్టు గావున. 87

గీ. మహి నసంఖ్యేయపుణ్యజన్మములమీఁద, నాత్మ హరిశేషతాజ్ఞాన మంకురించి ప్రాప్యమును బ్రాపకము సర్వమతఁడ యనుచు, నతనిశరణంబు చొచ్చుమహాత్ముఁడరిది.

గీ. గురుకృపాంజనరంజనస్ఫురిత మైన, శాస్త్రదృష్టిఁ బరాత్మశేషత్వరూప మైనయాత్మస్వరూపవిధాన మెఱిఁగి, నతఁడు తత్ప్రాప్తికై చొచ్చు హరిశరణము.

క. ఒకఁడు భగవంతుఁ డెట్లుగ, సకలేష్టవిధాయి యెట్లు చర్చింపఁగఁ దా నొకఁడ యగుఁ దత్ప్రపత్తియు, సకలార్థసమీహితార్థసాధన మనఘా!. 90

క. శరణాగతులకుఁ దక్కఁగ, బరులకు మోక్షంబు లేదు భవనస్థుఁడు నిర్భరుఁడు నన నిరుదెఱంగులఁ, బరఁగుఁ బ్రపన్నుండు సుకృతపరిపాకభిదన్. 91

క. శక్తాధికారి కనితర, భక్తిద్వారమునఁ జేసి పరమోపాయం బుక్తప్రపదన మితరా, సక్తునకు హితస్వతంత్రసాధన మరయన్. 92

వ. అందు నంగప్రతిపత్తిపరునకు నంగభూతప్రపత్తిసాధ్యంబును బరబ్రహ్మప్రాప్తిసాధకంబు నగుభక్తియోగస్వరూపం బాకర్ణింపుము. 93

## భక్తియోగస్వరూపనిరూపణము.

సీ. వేదాంతవాక్యార్థవిజ్ఞానజన్యంబు తద్విలక్షణము ప్రత్యక్షసమము
దర్శనోపాసనధ్యానాదిపదవాచ్య మాత్మాపరోక్షముఖ్యప్రతీక
ముక్తకర్మజ్ఞానయోగనిష్పాద్యంబు పరభక్తిముఖదశాంతరయుతంబు
యజనవందనకీర్తనాదిపర్యవసాయి యపునరావృత్తిమోక్షావధికము

గీ. తైలధారానవచ్ఛిన్నతాగతంబు, ప్రీతిరూపసమాపన్న మై తనర్చు
సతతభగవత్స్వరూపానుసంస్మరణము, భక్తియోగంబు తత్పదప్రాపకంబు. 94

వ. వినుము శాస్త్రార్థతత్త్వజ్ఞానంబుచేఁ గర్మయోగాధికారంబు సంభవించు జపతపస్తీర్థదానయజ్ఞాదిసేవనరూపం బైనకర్మయోగంబుచే జితాంతఃకరణుం డై పురుషునకు జ్ఞానయోగాధికారంబు సంభవించు. పరిశుద్ధాత్మభావనారూపం బైనయోగద్వారంబుచే నొండె నంతర్గతతాదృగ్విధాత్మజ్ఞానంబున నైనసాక్షాత్కర్మయోగంబుచేతన యొండె యోగాధికారంబులు గల్గు. ప్రకృతివిదితాత్మావలోకనరూపం బైనయోగంబుచే నాత్మశేషత్వజ్ఞానంబు దృఢం బై భక్తియోగాధికారంబు సిద్ధించు. పరమాత్మైకాంతికప్రీతి కారితధ్యానకీర్తనయజనవందనాద్యవస్థితిరూపం బైనభక్తియోగంబుచేఁ బరమభక్తిపరమజ్ఞానాదితదవస్థావిశేషముఖ్యంబున ముక్తుం డై పరమపదప్రాప్తుం డగు నట్లు గావున. 92

గీ. జ్ఞానకర్మంబు లాత్మదర్శనముకొఱకు, నాత్మదృష్టియుఁ భక్తిసంప్రాప్తికొఱకు

భక్తిభగవత్ప్రాప్తికై పరఁగు నిందు, లేదొకవిపర్యయసముచ్చయాదిశంక. 96

గీ. ధీరహితకర్మమును గర్మదూరమతియు, భక్తివిరహితధీక్రియల్ ముక్తబుద్ధి
కర్మ మగు భక్తియోగంబు గాదు గాన, వలయు మాత్రస్వరాదికాన్వయము చూవె.

క. ధీకర్మభక్తియోగము, లేక శరీరమునఁ గలుగ వెవ్వారికి నా
ధీకర్మంబులు జననా, నేకసహస్రములమీఁద నిచ్చుఁ భక్తిన్. 98

సీ. శాస్త్రార్థబోధంబు సంభవింపక యైన నొకఁ డెవ్వఁడేఁ గర్మయోగి యగుట
కర్మయోగావృత్తి గలుగ కేమియు నొకానొకఁ డెవ్వఁడే జ్ఞానయోగి యగుట
యుక్తాత్మభావనాయోగంబు లేకున్న నొకఁ డెవ్వఁడే యోగయోగ్యుఁ డగుట
యాత్మావలోకనం బభ్యసింపక యైన నొకఁ డెవ్వఁడే భక్తియోగి యగుట

గీ. ప్రాగ్భవాగమవిజ్ఞానఫలము చూవె, పౌర్వజననాకలితకర్మఫలము చూవె
ప్రథమజన్మాత్మభావనాఫలము చూవె, ప్రాగ్జననయోగపరిణామఫలము చూవె. 99

## త్యాజ్యసంసారరూపనిరూపణము.

వ. వస్తువివేకంబు లేక విషయవిరక్తియుం భగవద్భక్తియుం బొడమ వల్లగుట భజనీయభగవత్స్వరూపనిరూపణం బయ్యె నింకఁ ద్యాజనీయసంసృతిస్వరూపంబు వినుము. జీవుండు జ్ఞానస్వరూపుండును జ్ఞానగుణకుండును నిర్మలుండును భగవచ్ఛేషతైకరసుండును భగవదేకభోగ్యుండును నయ్యు ననాదికర్మరూపావిద్యాసంకుచితగుణభూతజ్ఞానుం డై స్వస్వరూపపరమాత్మస్వరూపంబుల విషయీకరింప నెఱుంగమి సహజానందవిముఖుం డయి యనాదినిజకర్మానురూప భగవత్సంకల్పకల్పితప్రకృతిపరిణామవిశేషం బైనకళేబరంబుచే బద్ధుం డై బంధనకళేబరంబుఁ దన్నుంగాఁ దలంచుకొని యింద్రియాధీనజ్ఞానుండును విషయాధీనసుఖుండును నై సర్పదష్టునకు నింబపత్రంబులు మధురంబు లై తోఁచువిధంబునఁ గర్మబద్ధుండైనతనకు జడప్రకృతిపరిణామవిశేషంబు లగుహేయవిషయంబులు భోగ్యంబు లై తోఁపఁ దదనుభవలుబ్ధబుద్ధి యగుచుం గర్మాచరణం బొనరించుచుఁ దత్ఫలంబు లైనసుఖదుఃఖంబు లనుభవించుచు వాసనావశంబునం గ్రమ్మఱ రుచి పుట్టి యుత్తరోత్తరంబు కర్మం బొనరించుచు ననలతప్తస్థాలీసంసర్గకారణంబున నుదకం బుష్ణభావబుద్బుదాదికంబు నొందుచందంబున నచిత్సంసర్గదోషంబున హేయదుఃఖాదికంబునకు నాస్పదం బై సంచరించు. తత్క్రమం బాకర్ణింపుము. అనాదిపూర్వకర్మకారణంబున సకలభావంబులయందుం దత్తద్దేవమనుష్యాదిరూపంబున జరాయుజత్వంబునుం, బక్షిసర్పాదిరూపంబున నండజత్వంబును, గీటకాచరాదిరూపంబున నుద్భిజ్జభావంబును, యూకాదిక్రిమిరూపంబున స్వేదజత్వంబునుం గాఁ జతుష్ప్రకారంబులఁ బుట్టుచుండు. ఇందు మనుష్యభావంబు దక్కం దక్కినపుణ్యపాపకర్మాధికారంబు లయినసకలభావంబులయందుఁ దత్తద్భావప్రయుక్తకేవలసుఖదుఃఖం

బులఁ బొందుచుఁ, బుణ్యపాపకర్మాధికారం బైనమనుష్యభావంబునందు బహిరంతరింద్రియవ్యాపారరూపం బైనజాగ్రద్దశ యప్పుడు జీవవ్యాపారద్వారకేశ్వరప్రయత్నసంసృష్టంబు లైనవిషయంబు లనుభవించుచుఁ, దదనుభవపరిశ్రాంతబహిరింద్రియోపరమరూపం బైనస్వప్నదశయందుఁ దత్తత్కాలమాత్రంబులు దత్తత్పురుషమాత్రానుభావ్యంబులుం గాఁ గేవలేశ్వరప్రయత్నసంసృష్టంబు లైనవిచిత్రవిషయంబుల నంతఃకరణంబుచేత నే యనుభవించుచుఁ, దదుభయదశావిషయవిశేషానుభవవ్యాపారపరిశ్రాంతబహిరంతరింద్రియోపరమరూపం బైనసుషుప్తిదశయందు నిస్సంబోధుండగుచు, బాహ్యాభ్యంతరంబులు మఱచి విశ్రమస్థానం బైనపరమాత్మయందు నుపరతుం డై విశ్రమించుచు, నతనిచే స్వస్థుం డై వెండియు భోగార్థంబు బోధితుం డై మేల్కనుచు, అర్ధమరణరూపం బైనమూర్ఛయందు నచిత్ప్రాయుం డై జ్ఞప్తిసంకోచంబు నొందుచు, నుత్క్రాంతిరూపం బైనమరణదశయందుం గ్రమంబున బహిరింద్రియంబు లంతఃకరణంబునందు నంతఃకరణంబు ప్రాణంబులందుఁ బ్రాణంబులు దన యందుఁ దాను భూతతన్మాత్రంబులయందుఁ దన్మాత్రంబులు పరమాత్మయందును బరిణమింప నిస్సంబోధుం డై బాహ్యాభ్యంతరంబులు మఱచి, బాహ్యాంతఃకరణభూతతన్మాత్రసంయోగరూపం బైనసూక్ష్మశరీరంబుతో నుత్క్రాంతుం డై హృదయస్థానసంబంధం బగు నేకోత్తరశతనాడికాదిగణంబునందు ముక్తైకనిర్గమద్వారం బైనమూర్ధన్యనాడిదక్కం దక్కినశతనాడీద్వారంబులవెంట నేదే నొక్కంట నేత్రశ్రోత్రాదిశరీరప్రదేశంబుల వెడలి, కేవలపాపపరుం డేని యాతనాతనూబద్ధుం డై నియమమార్గంబునం గింకరాకృష్టుం డై చని, నిరయంబు లనుభవించినపిదపం బరిశిష్టకర్మాంతరవశంబున 'జాయస్వమ్రియస్వ' యను సంకల్పమాత్రంబునఁ బునఃపునర్నికృష్టజన్మమరణంబులం బొరలుచు, ఇష్టాపూర్తాదిపుణ్యకర్మపరుం డేని సూక్ష్మశరీరంబుతో ధూమాదిమార్గంబునం గా నుత్తరోత్తరప్రాపితుం డగుచుఁ, గ్రమంబున ధూమరాత్ర్యపరపక్షదక్షిణాయనపితృలోకాకాశచంద్రస్థానంబులకుం జని, చంద్రప్రాప్తిచేత నమృతమయశరీరుం డై తత్తదనుగుణపుణ్యలోకంబులం దత్తదధిదేవతాకింకరుం డగుచుఁ దత్తత్సమానభోగంబు లనుభవించి, పుణ్యావసానంబునం గర్మాంతరప్రారంభంబునం గ్రమ్మఱ సూక్ష్మశరీరంబుతో నవరోహణక్రమంబున డిగ్గి, క్రమంబునం జంద్రాకాశవాయుధూమాభ్రమేఘంబులకు వచ్చి, మేఘంబుననుండి వర్షం బై పురుషునిం జెంది, పురుషునియందు రేతోరూపంబునం బరిణమించి, యోషిత్కుక్షిం బడి, యందు గర్భం బై పొదలి, క్రమ్మఱ జీవత్వంబునం జన్మించు. ఇట్టిసంసారావర్తగర్తంబునం బరిభ్రమించుచు. 100

ఆ. గర్భజన్మబాల్యకౌమారతారుణ్య, వృద్ధతాదు లైనవివిధదశల
నొకట నైన సుఖము నొందలేఁ డన్నిట, నవధి లేనివగల నంచుఁ బ్రాణి. 101

సీ. మలమూత్రపంకిలమాతృగర్భంబున నతిసుకుమారదేహము దపింప
ముడియకట్టుగ వీఁపునడుమునెమ్ములు వంగి యుల్బపరీతుఁడై యుండి లోన
నత్యుష్ణలవణకట్వమ్లాదితన్మాతృభోజనంబులకాఁకఁ బొక్కిపడుచుఁ
బరితృప్తి ముడువఁ జాఁపఁగ సమర్థుఁడు గామి సర్వాంగముల నొప్పి సంఘటిల్ల
గీ. నూర్పు వెడలక విజ్ఞానయుక్తిఁ బూర్వ, జనిశతంబులఁ దలపోసికొనుచు నిట్లు
కాంచు దుస్సహగర్భదుఃఖంబు మొదలఁ, బ్రాణి ప్రాచీనకర్మనిబంధనమున. 102

సీ. ప్రేరణోత్కటసూతిమారుతాహతి గర్భమున నధోముఖముగాఁ బొరలఁబడుచు
దేహసంకోచకద్రోహిణానిలముచే నానాస్థిసంధిబంధములు నొగుల
శుక్లమూత్రపురీషశోణితావృతి బ్రుంగి ముఖము విచ్ఛిన్నమై మొదల వెడలఁ
గేశమూర్ఛాయుక్తిః గ్రిమివోలె నెట్టకేఁ దల్లిదుర్గంధరంధ్రమున వెడలి
గీ. జగతిఁ బడి బాహ్యవాయుసంస్పర్శనమున, నెఱుక చెడి కావుకావున నేడ్చుఁ బ్రాణి
అంపమునఁ గోయుగతిముండ్లఁ ద్రెంపునట్లు,యోనియంత్రప్రపీడచే నొడలు నొవ్వ.

చ. మలమున బ్రుంగుఁడైనతలిమంబుపయిన్ శయనించి మేను చీ
మలు దిన మక్షికల్ గఱవ మానుప నేరక యెత్తగిల్లిపై
నొలసినతీఁట గోఁకికొన నోపకయే వ్యవహారమజ్జనా
దులును బరేచ్ఛఁ గైకొనుచు దుఃఖము వొందు శిశుత్వవేళలన్. 104

క. గురుజననిరోధశిక్షా, కరణంబులవలన నిలుపు గానక క్రీడా
పర మగుహృదయము దుఃఖా, కర మై తపియించుఁ బ్రాణి కౌమారమునన్. 105

సీ. ఎవ్వండ? నెందుండి యెచటి కేమిటికి నే బద్ధుండ నైతి నేబంధనమునఁ
గారణం బెయ్యది? కాదు కారణ మెద్ది? యెద్ది కారణజన్య? మేది కాదు?
ధర్మ మే దేది? యధర్మంబు నే దిప్పు? డెందు వర్తించెద? నెందు నిలువ?
నేది కృత్య? మకృత్య మెయ్యది? గుణసంవిశిష్ట మెయ్యది? దోషజుష్ట మెద్ది?
గీ. యనువివేకంబు లేక ప్రాయమునఁ గ్రొవ్వి, పశువువోలె శిశ్నోదరపరుఁడు నరుఁడు
సంచరించుచు నజ్ఞానసంభవంబు, నధికతర మైనదుఃఖంబు ననుభవించు. 106

క. కరణకళేబరపాటవ, కర మగుప్రాయంబు తనకుఁ గలుగుటకు దురా
చరణము ఫల మగు శిశ్నో, దరపరుఁడు సుఖంబ కాఁగఁ దలఁచు న్వగయున్. 107

శా. అజ్ఞానం బనఁ గాఁ దమోవిలసనం బజ్ఞానకార్యోదయం
బజ్ఞానానుగుణంబ కాన గళితోక్తాచార మాదానికిన్
బ్రాజ్ఞుల్ ప్రాప్యఫలంబు నారకము గా భాషింతు రట్లాటచే
నజ్ఞానాదుల నిందు నందు నిజ మై ప్రాపించు దుర్దుఃఖముల్. 108

సీ. మృగపక్షిరాక్షసోరగవరాదులచేతఁ బరఁగుతాపం బాధిభౌతికంబు
శీతోష్ణవైద్యుతవాతవర్షాదులఁ దనరుతాపం బాధిదైవికంబు
గుల్మజ్వరచ్ఛర్దికుష్ఠశూలాదుల నవమానకామలోభాదిదశల
శారీర మై మనోజనిత మై యిబ్భంగి నడరుసంతాప మాధ్యాత్మికంబు
గీ. పండితోత్తమ! యిట్టితాపత్రయంబు, ప్రాక్తనం బైనకర్మనిబంధనమున
ననుభవించుచు శోకార్తుఁ డగుచు నరుఁడు, బాల్యమున బ్రాయమున వృద్ధభావదశను.

వ. వెండియు జరాప్రాదుర్భావంబున శిథిలం బై కుదురుప ట్టెడలి లివలివం గదలురదనపఙ్క్తులును, జిగి చెగి బిగి పదలి స్రగ్గి వగ్గువడి తరంగితాయమానం బైనసర్వాంగీణచర్మంబును, బయలుపడి నిలువునం దేఱినబీఱనరంబులును, అంతర్గతకనీనిక లై దూషికాదూషితాస్రనిస్సృతిం జెక్కులం జిత్తడగొలుపుచు దూరితస్నైగ్ధ్యంబు లై వెలికుఱికినకన్నులును, పుంజికొని వెడలి నిడుద లై యుండుంగక రసగిలునాసాకేశంబులును, లాలావినిర్యాసంబులు సెలవుల నుఱుఁగుకొన దుర్గంధధురంధరం బైనవక్త్రకోటరంబును, ప్రస్ఫుటీభూతసర్వాస్థిస్థలంబును, పరిభుగ్నపృష్ఠాస్థిపరంపరాకంబు నయి కంపమానం బగుశరీరంబునుం గల్గి యెదుర నిల్చినం బోడగానక బెట్టు పిలిచిన వినక యాఘ్రాణించియు గంధంబు గొన సమర్థుండు గాక చప్పరించియుం జవిపొం దెఱుంగక జఠరానలంబుకుంఠితంబగుట నల్పాహారుండును నల్పాల్పవిహారుండును నై యెట్టకేనియుం దడవున లేచుచు నెట్టకేనియుం దడవునఁ గూర్చుండుచు నెట్టకేనియుం దడవునఁ జేష్టించుచు ననుభూతవస్తువుల నాక్షణంబ మఱచుచుఁ బ్రవృత్తిప్రయత్నాక్షమంబు లైనసకలకరణంబులచే మరణంబునకుం గాలుచాఁచియుఁ బూర్వజన్మవ్యాపారంబులునుం బోనితనప్రాయంబునాటిపోకలు దలంచుకొని యుస్సు రని వేఁడినిట్టూర్పుతోఁ బరితపించుచు సకృదుచ్చారణంబున మిగుల నలయుచు శ్వాసకాసమహాయాసంబున వేఁగుచు నంతకుం గంట బొట్టు వెట్ట నెఱుంగక వేఁగించుచు సంచారంబులకు నాకాంక్షించుచుఁ జవులు గొనంగోరుచు నోరులు లేప నెత్తం బరులు శయనింపఁ జేయ నఖిలశౌచవిరహితత్వంబున నెల్లరోఁతలకు నెల్లయై భృత్యు లవమానింపం బరిజను లపహసింప బాంధవులు ముక్కు విఱువం బుత్రులు వేసరం గళత్రం బోకిలింప నివి మొదలుగా వార్ధకదుఃఖంబు లనేకంబు లనుభవించి యంతమీఁద నత్యంతదుస్సహం బైనమరణం బనుభవించుఁ దత్ప్రకారం బాకర్ణింపుము. 110

సీ. హస్తాంఘ్రికంధర లవశంబులై త్రెళ్లి కలయ నంగంబులఁ గంప మొదవి
పలుమాఱు మూర్ఛిల్లి పలుమాఱు దెలివొంది తనకళత్రాదులతగులు మిగిలి
మరణావయవపీడ మర్మము ల్భేదిల్ల ప్రాణానిలంబు లపట్టు వదలి
తెల్లగ్రుడ్డులు తేలగిల్లి తీపులు పుట్టి దోషము ల్పొందుగఁ దొట్టగిల్లి

గీ. పొడమగు బ్రెత్తి తాల్వోష్ఠపుటము లెండి, తాపమున దప్పి నాఁకటఁ దప్తుఁ డగుచు
దుస్సహక్లేశమున మహాతురత యొదవ, నొరలుచును దేహ మొకభంగి నుత్క్రమించు.

ఉ. వేదన మీఱ నిత్తనువు వీడ్కొని జీవుఁడు తీవ్రశోషణా
పాదకయాతనావపురుషస్థితుఁ డై యమదూతపాశదం
డాదులపీడ నుగ్రపథయానము నంతకదర్శనాదినా
నాదురవస్థలం బొగిలి నారకబాధలఁ బొందు మీఁదటన్. 112

సీ. మొఱలు పెట్టఁగ అంపములఁ ద్రెంపఁ బడువారు పుటపాకములకాఁకఁ బొక్కువారు
వెడఁదగొడ్డండ్లఁ బచ్చడిసేయఁబడువారు పుడమిఁ బాఁతిన నుక్కిపోవువారు
కొర్ల వ్రేసిన గ్రుచ్చుకొని వ్రేలఁబడువారు నుప్పురొంపులఁ గ్రుక్క నురియువారు
క్వథితతైలములఁ బక్వము సేయఁబడువారు దెంచనంబుల వ్రేయఁ ద్రెళ్లువారు
గీ. పులులఁ బక్షులు భక్షింపఁ బొరలువారు, గలిగి శతధాసహస్రధాకారభిదలఁ
గలుగ దెన్నిక నిరయప్రకారములకు, దుఃఖ మేకైకమును గడు దుస్సహంబు. 113

క. నిరయానుభవము పిదపం, బరిశిష్టం బైనపూర్వపాపఫలంబుల్
బొరయుటకుఁ గూలఁ గ్రమ్మఱ, నరపశుమృగఖగనగాదినానాయోనిన్. 114

గీ. వినుము దుఃఖంబు నిరయసంస్థునకె కాదు, శతమఖస్థానమునయందుఁ బతనభీతి
నున్నదినములు నిర్వృతి నొందలేక, కూలఁ బుణ్యంబు తుదిఁ జాల కుతిలపడుచు.

క. మరలఁ గర్భము జన్మము, మరణము నిరయమును మఱియు మఱియు నయి నిరం
తరసంసృతిచక్రంబున, దొరలి నరుం డొందు సర్వతోదుఃఖములన్. 116

గీ. సుతకళత్రాదిసకలవస్తువులు వగల, బ్రుంగుపడనిసుఖంబు చేయంగఁ జాల
వేల నిన్నియుఁ? సంసారి కెద్ది యిష్ట, మదియపో దుఃఖతరుబీజ మనఘచరిత! 117

క. బ్రదికెడునంతకుఁ బురుషుఁడు, ప్రిదులక నిలు వెల్ల వగలఁ బెనఁగొనియుండన్
గుదురుకొని దూదిమాఁగుడు, బొదివినకార్పాసబీజమునకుం బ్రతి యై. 118

సీ. ప్రకృతినైకాకృతిపరిణామదేహంబు తన్నుఁ గా మూఢుండు దలఁచుఁ గానఁ
దదుపభోగ్యము లైనధనగృహాదులయందుఁ దనకు భోగ్యము లనుతలఁపు పుట్టి
భోగ్యత్వబుద్ధిచే భోగింపఁ గామించు భోగవిఘ్నములపైఁ బొడము గినుపు
భోగంబు చవిచూడఁ బొడము లోభము లోభమున నొం దెఱుంగమి మోహ మొదవు
ఆ. భోగలోభగర్వముల మదం బుదయించు, భోగసిద్ధి కొఱకుఁ బోక పెనఁగఁ
గలుగు మత్సరంబు గాన దేహాత్మాది, జనిత మీదురంతసంసరణము. 119

ఉ. పుట్టుగుచెట్టుకు న్మొలవఁ బోసినవిత్తులు శాంతిముక్తకుల్
మట్టియతోడజీవములు మోహపుటిర్లకునుం గుహూనిశల్

కట్టనియిం ద్రియంబులకుఁ గట్టడి యాసలసంప్రసూతికిన్
గుట్టులతోడిగర్భిణులు కోరిక లెవ్వరి నోంపకుండునే?. 120

ఉ. లజ్జకుఁ బాపు శీలముఁ గులంబు వడి న్విడిపించు సూనృతం
బుజ్జనసేయుఁ జేయ మొగమోటమిఁ దూలుచుఁ బాతకంబులన్
మజ్జన మార్చు నార్చు నభిమానము రోఁతల కియ్యకొల్పు నీ
ముజ్జగ మైనఁ ద్రిప్పుఁ దుది ముట్టదు దా ధనకాంక్ష యేరికిన్. 121

చ. అడుగనియండజాదులకు నాఁకలి దీరకయున్నె? దీనుఁ డై
యడిగెడుచోట నెంతఘనుఁ డైనను హీనుఁడె కాఁడె? హీనుఁ డై
యడిగెడువాఁడు తృప్తిపరుఁ డౌనె? యతృప్తుఁడు సౌఖ్య మొందునే?
యడుగుట యెన్నిజన్మముల కాఁడి నెవ్వగ వో తలంపఁగన్. 122

శా. పాత్రాపాత్ర వివేకరిక్తులు శుభప్రారంభముక్తు ల్పరీ
పోత్రీప్రాయులు తత్త్వసాధనకథాబోధానపాయుల్ శ్రవో
నేత్రఘ్రాణకజిహ్వికాపరమనోనిత్యానుకూలు ల్సదా
మాత్రద్వారసుఖాతిలోలు రహహా! మోక్షం బపేక్షింతురే?. 123

క. మలమూత్రరక్తపిత్తా, దులు వేర్వే రైన రోసి దుర్మదుఁ డిహిహీ!
మలమూత్రరక్తపిత్తా, దులప్రో వగు దేహ మింపుతోఁ గామించున్. 124

శా. చన్ను ల్గాఁక పసిండికుండ లఁట వక్షశ్చర్మ దుర్మాంసముల్
కన్ను ల్క్రొవ్విరిదమ్మిరేకు లఁట వెల్లద్దూషికాగోళముల్
వెన్ను ల్సోగయనంటియాకు లఁట సంపీతాస్థిపుంజంబు లీ
యన్ను ల్సౌఖ్యము గాఁ దలంచుజను లాహా! యెంత మూఢాత్ములో?. 125

క. అందాఁక గురువు దైవము, నందాఁక న తగవు ధర్మ మంతస్స్వహానం
బందాఁక నెల్లగుణములు, నెందాఁకం గినుపు వొడమ దెట్టినరునకున్. 126

ఆ. కినుపు దొఱఁగలేనిమనుజుండు సత్కర్మ, మాచరించు టెల్ల ననఘచరిత?
యింట నున్నపిల్లి నెడలింపకుండియ, యనుఁగుఁజిలుకఁ బెనుచునట్ల కాదె?. 127

ఉ. ఏకడఁ జొచ్చునో సుకృత? మెచ్చట డాఁగునొ తృప్తి? యెప్పుడో
పోకడ శాంతి? కెం దణఁగిపోవునొ సౌఖ్యము? మాన మేమి యౌ
నో? కృప యెట్లు మాయమగునో? యశ మేగహనంబు దూఱునో?
లోకమునం దెఱుంగ మొకలోభ మెదిర్చినమాత్రఁ జిత్ర మై. 128

చ. ఇడుమను ధర్మశాస్త్రకథ లిన్నియుఁ మిథ్యలు కూటిమాత్రముల్
గుడుచుట దుర్వ్యయంబు కొడుకుం బగవాఁ డడుగంగఁ జూచు నేఁ

గడపటఁ బ్రాణ మన్న సుఖగౌరవ మన్నను దైవ మన్న నే
ర్గడయుఁ ధనంబ తత్త్వ మనఁగా విను మర్మమ పొమ్ము లోభికిన్. 129

గీ. చంద్రసూర్యాగ్నిరుచులచే సడలిపోని, యట్టిమోహాంధపుటిర్లచే నంధు లగుచు
సౌఖ్యమార్గంబు గానక సకలజనులుఁ, గూలుదురు మాతృగర్భాంధకూపతతుల. 130

క. మును గలిగియుఁ రూపఱినం, గనియును విషయముల మఱియుఁ గాంక్షించు నిహీ!
యనుభవముమీఁద నెఱుఁగని, మనుజాధము మోహ మొరులమాటల విను నే?. 131

గీ. మరలకుండుట యెఱిఁగియు మఱవలేరు, విడక పోరామి యెఱిఁగియుఁ విడువలేరు
కానిపని యాట యెఱిఁగియుఁ మానఁ జాల,రద్భుతము గాదె మోహాంధులైన నరులు?

ఉ. మేరువుఁ బూరిగాఁ దలఁచు మి న్నఱచేతన మూయఁ బైకొనున్
నీరధిఁ బుక్కిలింతు నను నిర్జరనాథుఁడ నేన పొమ్మనున్
ధారుణి పెల్లగింతు ననుఁ దా నొకమానవకీట మైన నె
వ్వారలు మాన్ప లే రిది ధ్రువంబు మదం బనుసన్నిపాతమున్. 133

చ. గురువులకంటెఁ జుల్కనయుఁ గ్రూరతకంటె హితంబు దుర్జనో
త్కరములకంటెఁ జుట్టలు వృథాకలహంబులకంటెఁ గృత్యముల్
దురితముకంటె మేలు పరదూషణవృత్తముకంటె వేడ్కయున్
ధరఁ దమకంబుకంటె మఱి ధన్యత గల్గదు మర్త్యకోటికిన్. 134

క. ఇచ్చెద నను సర్వస్వముఁ, జొచ్చెద నను మర్త్యుఁ డెదిరి సొద యైనఁ దురిన్
జచ్చెద నను వెడపనికై, మచ్చరమునకంటెఁ గీడు మఱియుం గలదే?. 135

క. అనుభోక్త ద న్నెఱుంగం, డనుభవకారయిత వార్త యైనను నెఱుఁగం
డనుభావ్యతత్త్వ మెఱుఁగం, డనుభవమే కాని బద్ధుఁ డంధుఁడ కాఁడే?. 136

చ. విడువఁడు సౌఖ్యము న్మఱచి వేమఱు నతుంశబాధ నెమ్మిఁ గో
రెడు నగపడ్డ సింధురమురీతి ఫలోత్కటబంధనంబు మా
నెడుదెఱ వేర్పరించుకొన నేరక యింద్రియపంచకంబుచే
నుడుగనికోర్కిఁ దీర్చుకొను చుండుట మేలుగఁ జూచు జీవుఁడున్. 137

మ. ప్రతిదేహప్రళయంబు నందనతనూబంధానుసంబంధుఁ డై
ప్రతినైమిత్తికమున్ జతుర్ముఖశరీరస్థుఁ డై ప్రాకృత
ప్రతికల్పాంతమునం బరాత్మతను నిర్మగ్నాత్ముఁ డై యాలయ
త్రితయంబందు నరుండుఁ పీడఁ దచిదాప్తిం గ్రమ్మఱం బుట్టుచున్. 138

గీ. ఇట్టిసంసారబంధంబు హేయ మగుటఁ,గనియు వినియుఁ విరక్తుండు గాక మఱియుఁ
గోరి పొందు నరుండు తత్కారణం బ, నాదికర్మప్రవాహంబు మేదినీశ!. 139

చ. ఫలరసవాసనాప్రదవిభాగవశంబునఁ గర్మశక్తికిన్
గల దిరుభంగి యందుఁ బ్రతికర్మవిధానఫలానుభూతులన్
బొలియఁ బురోంశ మున్న పెరప్రోవు ఘటించుదురంతవాసనా
బలమున నుత్తరోత్తర మపారనిరంతరకర్మబంధమున్. 140

## మోక్షావతరణము.

వ. అట్లగుట సంసారచక్రంబు కర్మమూలం బగుటయుఁ దత్కర్మంబు దురంతం బగుట
యుఁ దప్పదు. ఐనను సుకృతదుష్కృతరూపం బైనయాకర్మంబు భగవదానుకూల్యప్ర
వృత్తిప్రాతికూల్యప్రవృత్తిరూపంబగుట ననుగ్రహానిగ్రహంబులచే సుఖదుఃఖప్రదుం
డయినయీశ్వరునకుం బ్రాధాన్యం బంగీకరింపలేకుండుటయు కాదు, తానునుం దత్పుం
కల్పాయత్తసత్తాప్రవృత్తికంబు. ఈయర్థంబుసృజ్యసంహార్యకర్మనిరపేక్షయుగవత్సృ
ష్టిసంహారాదులయందుఁ బ్రసిద్ధంబు. అట్లు గావున నిరంకుశస్వతంత్రుండయినయీశ్వ
రుండు వైషమ్యనైర్ఘృణ్యంబులకు లోనుగాక తత్తత్కర్మానుగుణంబు గా స్వర్గనిర
యంబు లొసంగునట్లు యచ్యుతస్వానుకూలప్రవృత్తిరూపం బైనయనాది మోక్షబీ
జంబుగలచేతనునకు మోక్షం బొసంగు. తత్క్రమంబు సావధానుండవై వినుము విశే
షంబుల నెల్లజీవులం దత్తత్కర్మానుగుణంబు గా సంసరింపం జేయుచు లీలాప్రవృత్తుం
డయ్యునీశ్వరుండు సమయప్రతిపక్షవీక్షాపరుం డై యొక్కకాలంబున నొక్కచో
నొక్కరునకుఘుణాక్షరన్యాయంబుననొక్కయాదృచ్ఛికస్వసేవాచరణంబు గలుగం
గటాక్షించి యందుం దచ్చేతనాభిప్రాయంబు లేకుండిన స్వాభిప్రాయంబునన యది
నెపంబుగా నతని నుద్ధరింప సన్నద్ధుం డయి విశేషప్రయత్నంబునకుం జొచ్చు నట్ల
గుటం జేసి. 141

క. తాదృగ్విధోక్తలఘుతర, యాదృచ్ఛికసుకృతికుం డనంతరదేహ
ప్రాదుర్భవంబునప్పుడ, శ్రీదయితేక్షణసుధాభిషేకముఁ గాంచున్. 142

గీ. ఎల్లపురుషుండు తనజనియించునపుడ, యజకటాక్షితుఁ డై రాజసాత్మకుండు
హరకటాక్షితుఁ డై తామసాత్మకుండు, హరికటాక్షితుఁ డై సత్త్వపరుఁడు నగును.

వ. ప్రత్యుపకారాదిహేతునిరపేక్షంబుగాఁ గేవలకృపైకమూలం బగుటనదియ భగవం
తునకు నిర్హేతుకకృపాకటాక్షంబు. 144

ఆ. కాన నిట్టిజాయమానకటాక్షంబు, గలుగఁ గలుగు సత్త్వగౌరవంబు
సత్త్వగుణమువలన సదసద్వివేకి యై, హితపదంబు దనకు నెఱుఁగ నేర్చు. 145

క. సదసద్వివేక మొదవిన, మదము త్తకుదృష్టిబాహ్యమత మగుచుఁ ద్రయీ
పదసేవితాభిముఖు డై, వదలదు సత్సంగమంబు వసుధాధీశా!. 146

క. సాత్త్వికశాస్త్రప్రవణుఁడు, సాత్త్వికసత్సంగమంబు సడలక భగవ
త్తత్త్వకథాశ్రవణంబున, సత్త్వరతవిముక్తి నొందు సంసారమునన్. 147

గీ. భ్రాంతి వాసిన మున్ను తద్భ్రాంతికతన, తనయొనర్చినవిక్రియల్ దలఁచి పోలె
దేహమాత్మ నవిభ్రాంతి దెలిసి నరుఁడు, ప్రాగహంకృతి కాత్మలోఁ బరితపించు.

ఆ. తనువుఁ దన్ను గాఁగఁ దలఁచుట తనుభోగ్య, విషయ మాత్మభోగ్యవిషయ మనుట
యిరుదెఱంగుభ్రాంతి యిదియ కదా! యవి, ద్యామహీజబీజ మనఘచరిత!. 149

క. తనుఁ దనువు గామి యెఱిఁగినఁ, దనుభోగ్యములందు భోగ్యతామోహంబున్
దినదినమున సడలి క్రమం, బున విషయవిరక్తిఁ గాంచుఁ బురుషుం డనఘా!. 150

క. కూరిమి విఱిగినసతిపై, నేరమి దోఁచుగతి విషయనిస్పృహమతి యై
కోరిక లుడిగినవానికి, నూరక విశ్వంబుమీఁద నొల్లమి పుట్టున్. 151

క. ప్రవితతవైరాగ్యమహా, దవదహనశిఖాముఖాతితప్తుఁడు తనకున్
భవసింధుతరణమునకున్, బ్లవము సదాచార్యవర్యపద మని చేరున్. 152

వ. చేరి గురుని దర్శించి పూర్వోక్తసదుపాయస్వీకరణంబున భగవద్భక్తుండై తదనుగ్రహాతిరేకంబున ముక్తుండగు నట్లుగావున నీశ్వరునకు వైషమ్యాదిపరిహారార్థంబు గానింతయుం బ్రపంచింపంబడియె నింతియ కాని సర్వసారం బైనరహస్యం బొక్కటి యాకర్ణింపుము. 153

గీ. గణనచో ధనికునిచేతఁ గనకకోటి, నొందెఁ గాకణికాకోటి నొందెఁ జెందు
గవ్వయునుబోలె మోక్షకక్ష్యముననొందె, బంధముననొందెఁబడుఁ బ్రాణి భగవదిచ్ఛ.

వ. ఈయర్థంబు 'నినిషాదోనినిష్ఠా' శ్రుతి సిద్ధం బని చెప్పి విరమించిన సర్వసందేహనివృత్తం బైనచిత్తంబు పరమనిశ్చయానందమగ్నం బై నృపకులతిలకుండు కులగురునకు సాష్టాంగం బెరఁగి లేచి కృతాంజలి యై. 155

గీ. ఉక్తసాధనమున మోక్ష మొదవునంత, కోర్వ వాత్సల్యనిధి పురుషోత్తముండు
నయనగోచర మగుసాధనంబు నాకు, నర్థి నానతి యిచ్చి కృతార్థుఁ జేయు. 156

## వసిష్ఠుండు మాంధాత కష్టాక్షరీమంత్రరత్నము నుపదేశించుట.

వ. అనిన నతనిభగవత్ప్రావణ్యంబునకుం దనయుపదేశసాఫల్యంబునకు నలరి యట్లేని తపంబునం గాని శీఘ్రంబున నిట్టికోర్కి సిద్ధింప దగుటం దపంబు సేయు మని వ్యక్తలక్షణంబున నతని భగవత్ప్రపన్నునిం గావించి జప్యం బైనమంత్రంబునుం దదర్థరహస్యంబునుం దదనుష్ఠానప్రకారంబును దదుచితనియమంబులు నుపదేశించి దీవించి ఋషులుం దానును బూజితుం డై వీడ్కొని చనినయనంతరంబ రాజర్షి వరుండును తమసాసరయూమధ్యంబునం గృతతపోధనుం డై యుక్తనిష్ఠం దపం బొనరింపం దొడంగె. 157

ఆ శ్వా సాం త ము.

ఉ. తార్కికవామనోన్నతలతామధుకోశ నిరీశసాంఖ్యయో
గార్క యపూర్వనిర్వహిత్రుహంసఘునాఘున నిర్గుణోక్తిమ
న్మర్కటనారికేళఫల మామకసాత్త్వవతేయ వాఙ్మయో
దర్కసుధార్ణవోదయవిధాయకపార్వణశర్వరీవరా. 158

క. ప్రచ్ఛన్నబౌద్ధదుస్సహ, హృచ్ఛర లక్ష్మణమునీంద్ర హృదయాదర్శ
స్వచ్ఛకరప్రతిఫలిత, స్వచ్ఛరణస్వస్వరూపసహజాకృతికా. 159

స్రగ్విణి. నిత్యధర్మాత్మకా నిత్యధర్మాస్పదా, నిత్యచిద్రూపకా నిత్యరూపోజ్జ్వలా
నిత్యబోధాశ్రయా నిత్యచిన్మాత్రకా, నిత్యనిర్వేదకా నిత్యభేదాంచితా. 160

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవక నరసింహనామ
ధేయప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబున వసిష్ఠాగమనంబును, రాజ
ప్రశ్నప్రతివచనంబులును, అందుః గర్మస్వరూప బ్రహ్మస్వరూపంబులును, వేదవేదాంత
పురాణస్వరూపనిరూపణంబును, భక్తిప్రపత్తిరూపసాధననిరూపణంబును, సంసార
నిరూపణంబును, మోక్షావతరణంబును నన్నది పంచమాశ్వాసము.

---

# షష్ఠాశ్వాసము.



రంగధరాధిప శృం
గారరసాధీశభావ గరుడగమన సం
స్మేరముఖాంబుజమధురా
కారాలంకృత నమజ్జగజ్జనహృదయా. 1

## మాంధాత తపంబు సేయుట.

వ. ఇట్లమ్మహీవరశ్రేష్ఠుండు నిష్ఠురతపోనిష్ఠుం డై. 2

చ. పరువడిఁ గందమూలఫలపర్ణజలంబులఁ గొన్నికొన్ని వ
త్సరములు వోవఁ గాఁ బిదప సర్వము మాని నిజాంతరంబునన్
హరి భజియించి శేషపవనాశనభర్తయుఁబోలె నాతఁడున్
గరువలిఁ గ్రోలఁ జొచ్చెఁద్రిజగంబులు విస్మయ మొందనయ్యెడన్. 3

## గ్రీష్మర్తువర్ణనము.

క. అతనిసమగ్రం బగుతీ, వ్రతపోగ్ని జగంబు నిండ వడిఁ బర్వినసం
గతి దుస్సహోష్ణసంప, ద్వితతం బై యంతలోన వేసవి వచ్చెన్. 4

ఆ. తాపతప్తజంతుతతుల విశ్వంభర, గర్భమున భరింపఁ గరుణఁ దలఁచి
తెఱపి యిచ్చె ననఁగఁ దీవ్రాతపాహతి, నేల నెల్ల గాఁడి నెఱియ లొదవె 5

సీ. ఏకార్ణవంబులో నిరవైనవటపత్రశయనంబు మదిఁ గోరె శార్ఙ్గపాణి
యష్టమూర్తులలోన నంబురూపము నాత్మఁ గాంక్షించె హరిణాంకఖండమౌళి
ప్రథమాంబుజఘ్రాణభావస్థితియ వేఁడి యభిలషించెఁ బయోరుహాసనుండు
వేడ్కగా కుండియు విలయోదకోదరస్థితి యపేక్షించె ధాత్రీపథూటి
గీ. హేమరజతాచలాదిమహీధరములు, హిమగిరిత్వంబు మతుల నూహించుకొనియె
సకలలోకానివార్యదుస్సహమహోష్ణ, భీష్మగతి యైనయమ్మహాగ్రీష్మవేళ. 6

క. ఆమనిరాజ్యం బెడలుట, గాముఁడు నెల వేదియున్నఁ గ్రమ్మఱ గ్రీష్మం
బాముక్తహారతోరణ, భామాకుచమండలమునఁ బట్టము గట్టెన్. 7

